# బి. రామనారాయణ శరణ్,

## విద్యానగర్, రింగ్‌రోడ్, గుంటూరు - 7.

| నెం. | పుస్తకము పేరు | పబ్లిక్ లైబ్రరీ డైరక్టరు హైదరాబాద్ వారిచే అంగీకరించిన నెంబరు | రేటు |
|---|---|---|---|
| 1. | శ్రీ సీతారామకల్యాణము | 2079/216 | 15-00 |
| 2. | శ్రీ రామపట్టాభిషేకము | 6731/తె800/4660 | 12-00 |
| 3. | నామవందనము | 432/87 | 4-50 |
| 4. | పార్వతీకల్యాణము | 434/88 | 4-00 |
| 5. | సుందరకాండము | 2080/217 | 4-00 |
| 6. | అరణ్యకాండము | 433/88 | 4-50 |
| 7. | కిష్కింధకాండము | 433/88 | 3-00 |
| 8. | మహావీర బజరంగ్ మత్రగ్రంథాలు | 9951/తె200/1028 | 6-00 |
| 9. | సంకీర్తన రామాయణము | జాబితా నెం. 26 | 0.30 |
| 10. | హనుమాన్ చాలీసా | | 1-00 |
| 11. | హనుమద్వైభవము | నిర్బంధ జాబితా నెం. 30<br>2650/నితె200/192 | 5-00 |
| 12. | బాలల హనుమంతుడు | | 7-00 |

# బాలల హనుమంతుడు






సంకలనము :

"ఆంధ్ర తులసి"

"శ్రీరామచరిత మానస వ్యాస"

**రామనారాయణశరణ్**

పరిష్కర్త :

శ్రీ శ్రీ డాక్టర్. తెలికేపల్లి లక్ష్మీ నారాయణశాస్త్రి,
M. A., Ph. D.,

ప్రథమ ముద్రణ : 1-2-1989

ప్రతులు : 1000

మూల్యము : 7-00



సంకలనము : రామనారాయణశరణ్

ప్రతులు దొరకు చోటు :
బి. రామనారాయణ శరణ్
విద్యానగర్, రింగ్‌రోడ్,
గుంటూరు - 7.



ముఖచిత్రకారుడు :
దేవిశెట్టి కృష్ణారావు

ముద్రణము :
శ్రీ శిరీషా ఆర్ట్ ప్రింటర్స్,
తెనాలి.

# విషయ సూచిక

శ్రీరామ జయరామ జయ జయరామ

## గణేశ ప్రార్థన

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్న వదనంధ్యాయేత్ సర్వ విఘ్నోప శాంతయే ।

## ఇష్టదేవతా ప్రార్థన

మనోజవం మారుత తుల్య వేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి

శ్లో॥ శ్రీ మత్కుందుర్తి వంశంబు నిధిరాకా సుధాకరమ్
బహు భాషాసు నిష్ణాతం శ్రీరామ శరణం భజే ॥ 1

శ్లో॥ రామాది మంత్రజప్తారం నామ సంకీర్తనే రతమ్
ఆధ్యాత్మ విద్యాసంపన్న శ్రీరామ శరణం భజే ॥ 2

శ్లో॥ ఆధ్యాత్మిక బహుగ్రంథ కర్తారం గురుపుంగవమ్
కవితా పాండితీ ధూరం శ్రీరామ శరణం భజే ॥ 3

శ్లో॥ రామనామాంకితం వస్త్రం ధార్యతే యేన సర్వదా
సద్గురుం పావనాత్మానం శ్రీరామశరణం భజే ॥ 4

శ్లో॥ జపతండుల పక్వాన్నం భుజ్యతే యేన సంతతమ్
తస్యాసార శ్చాప్యతేతం శ్రీరామ శరణం భజే ॥ 5

శ్లో॥ చిరకాలం నదీతీరే యేనతప్తం మహత్తపః
మంత్రసిద్ధిశ్చ లబ్ధా తం శ్రీరామ శరణం భజే ॥ 6

శ్లో॥ మంత్రోపదేశ మహిమా యదీయః కురుతేఽనిశమ్
బహుశిష్యాన్ కృతార్థాన్ తం శ్రీరామ శరణం భజే॥ 7

శ్లో॥ తులసీదాస రచిత రామాయణ సుధా సదా
ప్రపాద్యతే యేన భక్త్యా శ్రీరామ శరణం భజే ॥ 8

శ్లో॥ శ్లోకాష్టక మిదం నిత్యం పఠేద్యో భక్తిసంయుతః
గురోః కృపా పరాసిద్ధిశ్చా ప్యేతే తేన సర్వదా ॥ 9

మంగళం మహత్ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



# భూమిక

*శ్లో॥ దుర్లభం త్రయమే వైతత్ దైవాను గ్రహ హేతుకమ్ ।*
*మనుష్యత్వం, ముముక్షుత్వం మహా పురుష సంశ్రయః ।*

అత్యంత దుర్లభమైన మానవజన్మ, మోక్షకాంక్ష, మహా పురుషుల యొక్క ఆశ్రయముకేవలము దైవానుగ్రహమువల్లనే లభించునని శాస్త్రము.

నిత్యము మనచుట్టూ ఎన్నో రకాల జీవ రాసులను చూస్తున్నాం. చీమ, దోమ, పిల్లి, కుక్క మొ॥ వాటి కంటె మన మానవ జన్మ ఉత్తమ మైనది కదా! ఎంతో పూర్వజన్మ పుణ్య ఫలం వల్ల మనకీ మానవ జన్మ లభించింది. మరణించిన పిదప మరల మనకీ మానవ జన్మ లభిస్తుందనే నమ్మకం లేదు. మరి ఈ జన్మ యొక్క లక్ష్య మేమిటి? మోక్షమే. అనగా నిత్యము మనం చూస్తున్న ఈ చావు పుట్టుకల చక్ర భ్రమణము నుండి విడుదల. సుఖములకు పొంగిపోక, దుఃఖములకు కృంగిపోక సమచిత్తము కలిగి యుండుట. ఇట్టి ఉత్తమ స్థితిని ఇక్కడే, ఈ కర్మ భూమి యందే, మనమీ శరీరమును విడువక మునుపే (మరణించక ముందే) పొంది తీరాలి. గీతలో శ్రీకృష్ణ పరమాత్మ మనకు బోధించింది ఇదే.

*శ్లో॥ శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్*
*కామ క్రోధోద్భవం వేగం సయుక్తః ససుఖీనరః ।*

**(5-23)**

ప్రయత్న పూర్వకముగా శాస్త్రములలో నిర్దేసించిన సాధనలు చేసి, గురువనుగ్రహము ద్వారా అట్టి ఉత్తమ స్థితిని మనం పొందాలి. అపుడే మనం నిజమైన మానవులము.

ఈ లక్షాన్ని చేరుకోటానికి మనం బాల్యంనుంచే తీవ్ర ప్రయత్నం చేయాలి కాని వృద్ధాప్యంలోనో, ఉద్యోగులైతే రిటైర్ అయిన తర్వాతనో చేద్దామను కోవటం కేవలం అవివేకమే అవుతుంది. శరీర ఆరోగ్యం సరిగా ఉన్నపుడే మనలోని శక్తులు ఉన్నత స్థితిలో ఉన్నపుడే ఏదైనా సాధించగలము గాని అన్నీ వుడిగిపోయి అవసాన దశ వచ్చినపుడు అలమటించి ప్రయోజన ముండదు. ఈ మార్గంలో మనకు సజ్జన సాంగత్యం, సత్కథలు వినటం. సద్గ్రంథ పతనం ఎంతగానో ఉపయోగ పడతాయి. ఈ దశలో ఈ గ్రంథ రచయిత, ఈ కథలు వ్రాసిన శ్రీరామ నారాయణ శరణ్ ఎంతో కృషి చేస్తున్నారు. వారు 1975సం॥లో నాకు పరిచయమయ్యారు. వారు వారి గురుదేవులు పూజ్యశ్రీ శ్రీరామ శరణ్ ఆదేశానుసారం శ్రీరామ చరిత మానసము (తులసీ రామాయణము) తెలుగులోకి అనువదించే కార్యక్రమం ప్రారంభించారు. గడచిన దశాబ్దమంతా వారు ఈ కార్యక్రమాన్ని ఒక ఉద్యమంగా స్వీకరించి, తులసీ రామాయణములో చాలాభాగములు (యుద్ధ కాండ, అయోధ్యకాండ తప్ప) తెలుగులోనికి అనువాదం చేసి మనకందించారు. గ్రంథం వ్రాయుటం లేదాఅనువాదం చేయటం ఎంత కష్టమో, దానిని అచ్చు వేయించిప్రజల కందించటం కష్ట తరమైనటువంటి విషయం పాఠకులకు తెలియనిది కాదు ఇంతటి మహత్కార్యాన్ని వారు పూజ్యశ్రీ గురుదేవులు శ్రీరామ

శరణ్‌ల పరిపూర్ణ కృప, వారి కృషికి తోడైనదిగనుకనే సాధించ గలిగారంటే అతిశయోక్తి కాదు.

గత మూడు సంవత్సరాలుగా వీరు మరో కొత్త కార్యాక్రమాన్ని ప్రారంభించారు. రామ నామముతో శ్రీ ఆంజనేయ స్వామి పటము చిత్రించి భక్తులకు అందజేయుటం. తద్వారా వచ్చిన ధనము ఏదైనా వుంటే దానిని అన్నదానం చేయుటం ద్వారా సద్వినియోగం చేశారు. ఈ పద్ధతిలో వారు రామ నామాన్ని పంచి ఇచ్చి, సాధారణ ప్రజలని నామ స్మరణవైపు మళ్ళించటమే గాక, తద్వారా వచ్చిన కొద్దిపాటి ధనాన్ని నారాయణ సేవకే వినియోగించటం గమనించ దగినది.

1987 సం॥ లో శ్రీరామ నారాయణ శరణ్ గారికి మరో ఆసక్తి కరమైన సంకల్పం కలిగింది. దానికి కూడా శ్రీ ఆంజనేయ స్వామి ప్రేరణయే కారణమని నా విశ్వాసం. భావి భారత పౌరులైన బాల బాలికల కొరకు ఏదైనా ఒక గ్రంథం కథల రూపంలో వ్రాయాలన్నదే ఆ సంకల్పం. వారిలో వున్నది, మనం ఆదర్శంగా తీసుకో వలసినది ఒక్కటే. సంకల్పం కలగటం ఆలస్యం దాన్ని కార్యరూపంలో పెట్టేందుకు వారు అన్ని ప్రయత్నాలు ప్రారంభిస్తారు. మన పురాణాలలో, శాస్త్రాలలోను దైవాన్ని గురించి, దైవానుగ్రహం పొందిన మహాత్ముల గురించి ఎన్నో కథలు ఉన్నాయి గదా! మరి వాటిని మన బాల బాలికలకు వినిపిస్తే వారికెంతో ఆదర్శంగా వుంటుంది అని భావించారు.

గాంధీ మహాత్ముడు, ఛత్రపతి శివాజీ మొదలగు మహాత్ము లంతా బాల్యములో పురాణ పురుషుల కథలు వినే గదా వారి జీవితాలు ఆదర్శవంతంగా తీర్చి దిద్దుకొనడమే గాక, భారత జాతినే ఉద్ధరించారు.

శ్రీరామ నారాయణ శరణ్ హనుమదుపాసకులు మరియు హనుమ దనుగ్రహం, గురువు అనుగ్రహం పొందిన పుణ్య పురుషులు. కాబట్టి ఆంజనేయ స్వామికి సంబంధించిన కథలనే ఎన్నుకున్నారు. వారి వజ్ర సంకల్పం ఫలించింది. "హనుమద్వైభవము" అను పేర కథల సంపుటి గ్రంథ రూపంలో ప్రచురించబడింది. 1988 నూతన సంవత్సర శుభ దినాన ఆ గ్రంథం తెనాలి వైకుంఠ పురంలో ఆవిష్కరించబడి ఆంధ్రుల కందించబడినది. ఆ విధముగా వారు సఫల మనోరథులు.

కాని చిన్న పిల్లల కొరకు ఏదో వ్రాయాలన్న వారి తపన అంతటితో తీరలేదు. దాని ఫలితమే ఈనాటి "బాలల హనుమంతుడు". ఇందులో 12 చక్కటి కథలను ఎన్నుకున్నారు. ఈ కథలన్నీ బాల బాలికలకే గాక ప్రతి మనిషికీ ఒక ఆదర్శాన్ని ప్రబోధిస్తూ, స్ఫూర్తి నిచ్చేవిగా వున్నాయి, మన సమాజంలో, అధునాతన నాగరికత మన సుఖభోగాలను ఎంతగా అభివృద్ధి చెందిస్తుందో అంతగా అశాంతి గూడా మనల్ని వెంటాడుతుందన్న విషయం మనకు తెలుసు. దీనికి కారణం మనిషి మనిషిగా మనుగడ సాగించక పోవటం. 'మనిషి' అంటే "మని" (*Money*) 'షి' (*She*) గా భావించుకొని మానవత్వపు విలువలను మంటగలిపి

దానవుడుగా ప్రవర్తించటం. ఈ అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టా డుతున్న మనకు ఈ కథలు ఆధ్యాత్మిక చిరుదివ్వెలై వెలుగును చూపిస్తాయనటంలో ఎలాంటి సందేహం లేదు. ఈ విధంగా సమాజ సేవచేసి శ్రీరామనారాయణ శరణ్ ధన్యులయ్యారు.

శ్రీరామ నారాయణ శరణ్‌గారి సాంగత్యం లభించుటవల్లనే రామనామ ప్రచారానికై దివి నుంచి భువికి దిగిన నామావతా రము శ్రీరామశరణు మహోదయులను గురువుగా పొందే భాగ్యం నాకు లభించింది. సజ్జన సాంగత్య ఫలితమది. శ్రీరామ నారా యణ శరణ్‌గారు చేపట్టిన ఈ ఆధ్యాత్మిక పునరుజ్జీవన కార్య క్రమములో నేనొక సాధారణ కార్యకర్తగా పాలుపంచుకొనే అవ కాశం కలుగ జేసినందుకు ఈ శరీరం వారికి ఋణపడి వుంటుంది. వారికివే నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

మిడుతూరి వెంకట నరశింహారావు
బి. ఏ., బి. జి. యల్.
అసిస్టెంటు లేబరు ఆఫీసరు - I
తెనాలి.



# సుమాంజలి

ఆబాల్యం నుండి భక్తిభావం పరిపక్వం చెందాలి. హను మత్కథలతో, మరికొన్ని నీతి కథలతో బాలురకు శిక్షణ నెఱపవలె నన్న లక్ష్యంతో 'ఆంధ్రతులసీ' 'శ్రీరామ చరిత మానసవ్యాస' బిరు దాంకితులయిన శ్రీ శ్రీరామనారాయణ శరణ్‌జీ సరస్వతీ క్రతువుకు దీక్షవహించారు. సూక్ష్మదృష్టితో ఈ గ్రంథ నామకరణం గురించి ఆలోచించుదాం. బాలలలో హనుమంతుడు ప్రసన్నుడవుతాడు. హనుమంతునిలోబాల్యం విమల విలాసం చేస్తుంది. బాల్య భావనయే భగవదను గ్రహానికి భవ్యసాధనం. ప్రౌఢులు కూడ బాలురని భావించుకొననిదే హనుమంతుని అనుగ్రహానికి పాత్రులుకాలేరన్న ఆలోచనతో ఈ భక్తకవి ఈ కృతికి 'బాలల హనుమంతుడు' అని నామకరణం చేసి ఉంటారు.

'సూరజ్ మల్' వలె ఆర్తభక్తుల మయితే అరుణముఖు డయినహనుమంతుడు ప్రసన్నుడవుతాడని ప్రథమ కథా ప్రబోధం. "జయ సియరాం జయ జయ హనుమాన్" అను తారక మంత్రం తో కాశీరాజు తరించాడు; కోదండరాముడు తల వొంచాడు. మాతృ శపథానికి దీక్ష వహించిన హనుమాన్ ద్వితీయ కథలో అద్వితీయ మయిన ఆదర్శమూర్తియై విరాజిల్లుతాడు. నిష్కామ సేవాపరా యణుడయిన అవంతికాప్రభువు మన అంతరంగంలో ఒక్క క్షణం నిలబడితే చాలు నరకసమానమై పతనమయిన మన నరలోకం సురలోకం కాజాలదా ! సంపన్న గృహస్థుడొకడు సాధు మహా త్ముని సాంగత్యంతో సాకేత లోకాన్ని స్వంతం చేసికొన్నాడు (అయి దవ కథ). సాధుజన సాంగత్యం సాధించరానిది లేదు కదా !

చాలీసా పారాయణమ్ ప్రభావం వలన హనుమంతుడు దర్శన భాగ్యం ప్రసాదించాడు (ఆరవ కథ). చాలీసా శక్తి అమోఘం! జననీ జనకులే ఇలవేలుపులని భారతీయ సంస్కృతీ భవ్యసందేశం. గణాధిపునివలె తల్లిదండ్రులను సేవించితే ఇల్లే కైలాసం అవుతుందని ఒక కథానీతిసుధ. అన్నదాన ఫలితం అనుపమానమని ఇంకొక కథ.రామ నామాంకితమయిన రాళ్ళు పూలవలె జలాలపై తేలియాడినవి. రామనామ సంకీర్తన చేస్తే మనం కూడా ఈ సంసారసాగరంలో మునిగిపోమని ఒక కథా సందేశం. ఏ కథ కాకథయే దివ్యసుధ. పాన మొనర్చుట మన వంతు, తన కృపకు పాత్రులను చేయుట హనుమంతుని వంతు.

స్వానుభవము, సందేశములు అభిన్నమయిన కవియోగి శ్రీ శ్రీరామ నారాయణ శరణ్‌జీ. అందుకే ప్రతి కథలోనూ ఒక విద్యుత్తరంగం ప్రవహిస్తున్నది. పాఠకుని అంతరంగంలో శుభ ప్రభాతాలను ప్రసారితం చేస్తున్నది. శ్రీ శ్రీరామ నారాయణ శరణ్‌జీ పూజ్య గురుదేవులు శ్రీ శ్రీరామ శరణ్‌జీ దివ్యచరణ కమలాలపై నిత్యమూ పరిమళించే రసవత్తర తులసీ దళం. ఆ తులసీ దళ పుణ్యరుచులే ఈ కథా సుధలు. ఈ కథా సుధను నిత్యమూ సేవించి కృతార్థుల మవుదాం.

డాక్టర్. తెలికేపల్లి లక్ష్మీనారాయణ శాస్త్రి
ఎం. ఎ., పి. హెచ్.డి.,

ఆంధ్ర విభాగాధ్యక్షుడు
శ్రీ చుండి రంగనాయకులు కళాశాల
చి ల క లూ రి పే ట

# నా మనవి

'ఆంధ్రతులసి' 'శ్రీరామచరితమానస వ్యాస'

***రామనారాయణ శరణ్***

భక్తులారా !

"కుంభినీధవు చెప్పెడి గురుడు గురుడు" "హరిని జేరుమనియెడు తండ్రి తండ్రి" అని భాగవతకారుడు చెప్పినట్లు భగవంతుని భజింపుడని చెప్పని గురువు గురువుకాడు, తల్లిదండ్రులు తల్లి దండ్రులుగారు. బంధువులు బంధువులుగారు. భార్య భార్యగాదు. భర్త భర్తగాడు. భగవంతుని జేరుమని, భజింపుడని చెప్పేవారే నిజమైన తల్లిదండ్రులు. రక్తము, మాంసము, ఎముకలు, చీము, మలమూత్రాదులతో గూడిన ఈ శరీరమును నమ్మకుము. నీవు చేసిన సత్కర్మలు దుష్కర్మల ఫలితములే తెప్పగనై నీ వెంట వచ్చును.

సుగంధ, అగరుబత్తీలు కాలిపోతూ కాలిపోతూ, మల్లె పుష్పములు నలిగిపోతూ నలిగిపోతూ, మంచిగంధపుచెక్క రాపిడిచే అరిగి పోతూపోతూ సువాసనలు కలుగ చేయునట్లు మానవుడు యమ, నియమ, ఆసన, ప్రాణాయామాదులు చేయుచు, ఆహార నియమములు పాటించుచు, బ్రహ్మచర్య వ్రతధారుడై నియమానుసారముగా అంత్యదశ వచ్చువరకు భగవన్నామమును చేయుచు, సాధు మహాత్ములకు సేవలు చేయుచు, సత్కర్మలు ఆచరించుచుండిన యెడల భగవదనుగ్రహ పాత్రులగుదురని శ్రీరామశరణ్ మహోదయులును, కంటిలో పుట్టిన పొర కంటినే కప్పివేసి నట్లు నీటిలో పుట్టిన పాచి నీటినే కప్పినట్లు, నిప్పులో పుట్టిన నివురు నిప్పునే కప్పివేసినట్లు, సూర్య కిరణములచేత నీరు ఆవిరియై ఆ

ఆవిరియే మేఘములుగా నేర్పడి సూర్యునే కప్పునట్లు; కలిలో పుట్టిన మానవుల కలిదోషములగు పాపములు పట్టి పీడించుటలో ఆశ్చర్య మేమున్నది. శస్త్రచికిత్స ద్వారా కంటిపొరను తప్పించిన చూపువచ్చునట్లు, నీటిపై కలిగిన పాచిని తొలగించిన ఆ నీటిచే వప్పిక తీర్చుకొనునట్లు, వాయువులు వీచిన మేఘములు చెల్లాచెదురై సూర్య కిరణములు ప్రసరించి వెలుగు నిచ్చునట్లు ఈ మానవుడు ప్రతిపాత్రుడై నియమముగా భగవన్నామమును కీర్తించిన, ఈ దుఃఖభూయిష్టమైన సుత, కళాత్రాదు లనెడి మొసళ్ళతో కూడిన సంసార సముద్రము నుండి బయటపడుటలో రామ, కృష్ణ, శివనామములే శరణ్యములని పూజ్య శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి (అలహాబాద్) మహారాజుగారు ప్రబోధించిరి.

స్వాతి చినుకులు పామునోటపడిన విషముగాను, అవేచినుకులు ముత్యపు చిప్పలోపడిన మంచి ముత్యములగుట జగమెరిగిన విషయమే. పరుసవేది ఇనుమును తాకిన బంగారము అగునట్లు, హంసలదీవి స్నాన మహిమ వలన కాకి హంసగాను, త్రివేణి స్నానమహిమ వలన కొంగ హంస అయినట్లు పెద్దలు చెప్పుచున్నారు గదా! అటే విధముగ సజ్జన సాంగత్య మహిమ కానరానిది. ఎన్నో జన్మలలో పుణ్యము చేసిననే సత్సంగము లభించును. పూర్వజన్మలో తపస్సు, యజ్ఞాది కర్మలు భగవన్నామమును స్మరించుట దానధర్మములు, శుభకర్మలు చేయుట, సాధుశ్రేష్ఠుల దర్శించుట మొదలగు పుణ్యకర్మలు చేసిననె సత్సంగము లభించునని రైదాసు ఉవాచ.

బాలులారా ! ఇతరులను నమ్మి రక్షింప మనకండి. ఆర్త త్రాణ పరాయణుడు శరణాగత రక్షకుడు నగు శ్రీరామచంద్ర ప్రభువే మనలను రక్షింప గలడు. దీనికి దృష్టాంతముగు ఈ క్రింది కథను చదువుడు.

అక్బరు చక్రవర్తి ఒకనాడు అడవిలోకి వెళ్ళినాడు. అతనికి దప్పిక బాధ మిక్కుటముగా నుండి ప్రాణములు పోవునట్లుండెను. ఒక రైతు అదే సమయమున అడవి మార్గమున వెడలుచూ తన కొరకుగాను తాబేటి బుర్రలో నీరును నింపుకొని నడచుచుండుటను అక్బరు చూచి అతని దగ్గరకు వెళ్ళి తన దప్పిక బాధను గూర్చి చెప్ప తన వద్ద నున్న నీరును ఆ రైతు అక్బరునకు యిచ్చినాడు. ఆ మంచినీటిని త్రాగుటచే అక్బరునకు ప్రాణములు నిలిచినవి.

అక్బరు యీ రైతు చేసిన మేలును మరువరాదని స్వదస్తూరీతో ఒక చీటిని వ్రాసి అతనకు యిచ్చి ఓ రైతన్నా నీవు నిరంతరము మా రాజమహల్‌కు వచ్చుచూ, పోవుచూ వుండ వచ్చును. నిన్ను అడ్డుపెట్టు వారెవ్వరు వుండరు. నేను వెళ్ళి వచ్చెదను అని పలికి ఢిల్లీకి వెడలి నిశ్చింతగా రాజ్య పరిపాలన సాగించుచుండెను.

ఈ రైతు ఒకనాడు అక్బరు ఆస్థానమునకు వెడలి యీ చీటిని అక్కడ ఉద్యోగికి చూపించినాడు. ఈ రైతును ఆ ఉద్యోగి రాజమహల్ లోనికి పంపినాడు. అచ్చట ఎవ్వరును ఇతనిని అడ్డుపెట్ట లేదు. ఆ రైతు నేరుగా అక్బరు దగ్గరకు వెడలినాడు,

ప్రాణ దానము చేసిన వాడగుటచే అక్బరు ఆ రైతును ఎంతగనో గౌరవించినాడు. తన ప్రక్కన కూర్చుండబెట్టుకొని ఓ రైతన్నా నీ కోర్కెను నాకు తెలుపుము. నీ కష్టమును తెలుపుము. నేను నెరవేరుతును అని పలికినాడు. ఆ రైతు సమాధానము చెప్పక మరునాడు వచ్చెదనని పలికి అక్బరు అనుమతితో అచ్చట నుండి తన యింటికి బయలుదేరినాడు.

మరునాడు ఆ రైతు అక్బరు చక్రవర్తి దగ్గరకు వచ్చినాడు. ఆనాడును అక్బరును ఏమియు అడుగ లేదు. ఓ రైతన్నా నీవేమి కోరుకొందువో అది యిచ్చుటకు సిద్ధముగా నుంటిని. నీవు నా ప్రాణములు నిలిపిన వాడగుటచే నీ ఋణమును తీర్చుకో జాలను. అని అక్బరు పలికినను ఆ రైతు ఏమియు కోరుకొన లేదు. అక్బరునకు నమాజు చేసుకొను వేళయినది. అతడు మసీదుకు వెడలుచుండ చక్రవర్తితో పాటే యీ రైతును మసీదు కు వెడలినాడు.

అక్బరు నమాజు చేయుచూ చేయుచూ రెండు చేతులతో దోసిలి పట్టి ప్రభువును ప్రార్థించుచూ నాకు గల కోర్కెల నెర వేర్చుదని పలికినాడు. అల్లాను ప్రార్థించుట ఆ రైతు విని అచ్చట నుండి వెనుదిరిగి నడవసాగినాడు. అక్బరు చక్రవర్తి వానికి ఎదురేగి ఓ రైతన్నా నీవు ఏమియు నన్ను అడుగకనే నీ గృహము నకు వెడలుచుంటివి ఏల. నీవు ఏదైనా వస్తువును, ధనమును, వస్త్రమును కోరుకొనుము. నేను నీకోర్కెలను తీర్చుటకు సిద్ధ ముగా నుంటిని అని పల్కినాడు.

ఆ రైతన్న చక్రవర్తి మాటలు విని, అయ్యా! మీరును భగవంతుని యాచించుచుంటిరి. మీరును బికారులే. అట్టి బికారిని యీ బికారి యాచించి ఏమి ఫలితము పొందగలడని పలికి, నాకు ఏదైన అవసరము వచ్చిన నేనును దీన రక్షకుడు, ఆర్తత్రాణ పరాయణుడు, ఆపద్బాంధవుడు అగు శ్రీమన్నారాయణమూర్తిని శరణు వేడుదును అని పలికినాడు. ఆ రైతన్న పలికినపలుకులకు అక్బరు చక్రవర్తికి ఆశ్చర్యము కలిగినది.

కనుక బాల బాలికలారా! మీరును మానవులను ఆశించక దాతకు దాతయు, దీనుల బాధల పోగొట్టువాడు లక్ష్మీ నిలయుడు నగు రామ నారాయణ ప్రభువును శరణు జొచ్చిన మీకు సర్వవిధముల మేలు కలుగును.

చిరంజీవులారా! ఎంతటి వారికైనను గర్వము పనికిరాదు. గర్వము వున్న యెడల పతన మగుటలో సందేహము లేదని ఇతిహాసాది గ్రంథములు చెప్పుచున్నవి గదా. రావణ కుంభకర్ణులు, దుర్యోధనాదులు మూర్ఖత్వము వలన తమ కంటె గొప్పవారు లేరని విర్రవీగి వంశ నాశనము చేసికొనుట జగ మెరిగినదే కదా!

సృష్టి, స్థితి, లయకారుడగు శ్రీరామ చంద్రుడు బలవంతుడనని, హాలాహలమును పానము చేసిన శివుడు మహిమాన్వితుడునని భావింపక హనుమద్వ్రతమును జరుపుకొని వారి వారి కష్టముల, బాధల పోగొట్టుకొనుసట్లు పరాశర మహర్షి తన పరాశర సంహితలో చెప్పినాడు. (రామా! ఒక కొమ్మపై నుండి వేరొక కొమ్మపైకి దూకు నాకు అట్టి శక్తి ఎక్కడిది? కేవలము నీ అనుగ్రహమే అని హనుమంతుడు పలుకుట జగమెరిగినదే గదా!)

హనుమంతుడు రామాయణమును రచించినట్లు ఆది కవి యగు వాల్మీకికి తెలిసెను. కృష్ణ శిలలపై హనుమంతుడు రామ కథను నవరస భరితమైన శైలిలో వ్రాసినాడు. వాల్మీకి మహర్షి ఆ హనుమద్ రామాయణమును చూచి వ్యసనము చెందిన వాడై యీ రామాయణము వుండిన యెడల భూమండలముపైనా రామాయణము ప్రచారమునకు రాదని భావించి బాధ చెంది హనుమంతుని వద్దకు వెళ్ళి

ఓ వాయునందనా! ఓ శ్రీరామ భక్తా! మిక్కిలి బలము గలవాడా! బుద్ధిమంతుడా! ఆంజనేయా! నీవు జ్ఞానులకు జ్ఞానివి. నీవు వ్రాసిన రామ చరితమును చూచితిని. నీ రచన ముందు నాచే వ్రాయబడిన రామ కథాశైలి విధానము వీగి పోవునట్లున్నదని వాల్మీకి పలికినాడు. హనుమంతుడు ఆ వాల్మీకి మాటలను విని యిట్లు పలుక సాగినాడు.

ఓ వాల్మీకి మహర్షి! నీ కీర్తి కాంక్షకు అడ్డురాను. అని పలుకుచూ, కృష్ణ శిలలపై తను వ్రాసిన రామాయణమును భుజముపై నుంచుకొని వేరొక భుజముపై వాల్మీకిని కూర్చుండ బెట్టుకొని సముద్రములోనికి వెడలి ఆ కృష్ణ శిలల గిరవాటు వేసినాడు వాల్మీకి మహర్షికి ఆశ్చర్యము కలిగినది. ఆంజనేయునితో యిట్లు పలుక సాగినాడు.

ఓ ఆంజనేయా! నీ వెంతటి అకించనుడవో, నిర్లిప్తుడవో, కీర్తి కాంక్ష రహితుడవో, రామసేవా పరాయణుడవో, ఎంతటి త్యాగ ధనుడవో నాకిప్పుడు అవగతమైనది. నీ విధి విధానమునకు

జోహారు లర్పించుచున్నాను. అని పలుకుట యీ ప్రపంచమునకు తెలియనిది కాదు గదా !

కావున, చిరంజీవులారా ! హనుమంతులవలె నిరహమ్కార మును కలిగి రామనామమును కీర్తించుచూ, పెద్దలకు సేవలు చేయుచూ కాలము గడుపు చుందురేని ఆనందము, శాంతి, సుఖము గలుగుటలో ఆశ్చర్యము ఏమి గలదు ? అష్ట దిక్పతులును భగవన్నామమును చేయుట ద్వారా వారి వారి పదవులను పొందుట జగమెరిగిన విషయమే గదా ! పాప రూప మనెడి కలి సర్పమును భక్షించుటకు రామ నామము నెమలి వంటిదని తెలుసుకొని స్మరించి, కీర్తించిన మీమీ బాధలు పోగొట్టు కొని విద్యా వంతులై వినయ సంపదతో రాణించెదరు.

బాలులారా ! ఎన్నో జన్మలలో పుణ్యము చేసిన వారి నోటి నుండి మాత్రమే భగవన్నామము వచ్చును. పూర్వ జన్మలో దానాది సత్కర్మలు, తపస్సు, యజ్ఞము, శుభకార్యములు చేసి యుండని యెడల భగవన్నామమును స్మరింపలేరు.

ఎవరి ధనము భగవన్నామ సంకీర్తనమునకు, పరోపకారము నకు, సత్కర్మలకు ఉపయోగ పడదో అట్టి ధనము పాపము చేత ఆర్జించబడినదే. పాపముల చేత సంపాదింప బడిన ధనము పుణ్య కార్యములకు ఉపయోగ పడదు. సుకృతమున ఆర్జింపబడిన ధనము సత్కర్మలకు ఉపయోగపడును. ఎవరికి భగవన్నామ మందు విశ్వాసము లేదో, దుష్ట కర్మలు చేయు చుందురో అట్టి వారు గోమూత్రమును పానము చేసిన సర్వ దోషములు తొలుగు నని శ్రీరామ శరణ్ జీ మహోదయులు శ్రీ త్రివేణి సంగమ నివా

సులు, మహాత్ములునగు శ్రీ శ్రీప్రభుదత్త బ్రహ్మచారి గారు పలుకు చున్నారు గదా !

రావి చెటు క్రిందగాని, జమ్మి చెట్టు క్రింద గాని, అరటి తోటలో గాని, తులసీ వనములో గాని, హనుమంతుని విగ్రహము గాని, ఫోటో కాని పెట్టి 108 ప్రదక్షిణలు చేస్తూ, హనుమాన్ చాలీసా గాని, భజరంగ్‌బాణ్ గాని, సంకటమోచన అష్టకము గాని, హనుమాన్ బాహుక్ కాని నియమముగా 45 దినములు, 90 దిన ములు, 108 దినములు పారాయణ ఒకే సమయమునకు చేసిన కోర్కెలు నెరవేరుటలో సందేహము లేదని గంగాదాస్ (తులసీదాసు గారి సమకాలికుడు) న్నూ మరియునేటి భక్తులు పలుకు చుండుట జగమెరిగిన విషయమే.

బాలులారా! శ్రీరామ నామము తల్లి దండ్రుల వంటిది. బంధువులు లేని వారికి బంధువై కాపాడును. ప్రాణము పోవు నప్పుడు తెప్పగనై కాపాడును. సర్వరోగములను, సర్వ ఉపద్రవ ములను పోగొట్టును. శాంతిని, సుఖమును, ఆనందమును కలుగ చేయును. పాప పుంజములను మేఘములను పార ద్రోలుటకు ప్రచండ వేగముగ వీయు వాయువు వంటిది.

బాలులారా ! పాలివ్వని గోవువలె, ఫలింపని వృక్షమువలె, వర్షింపని నల్లని మేఘముల వలె రామ నామము చేయ కుండిన వాడెంతటి ధనిక వర్గమునకు చెందిన వాడైనను ఉన్నత కులములో జన్మించినను రాజైనున నిష్ప్రయోజకులే. శూద్రుడైనను, చండాలు డైనను, శ్రీరామ నామమును నోరార చేయునేని ఉన్నత విలువలు గలిగిన వాడే శివ, రామ, కృష్ణ, గోవింద నామములు అఖండ

ముగా కీర్తించిన దూది రూపమున గల పాపపు రాసులు దహింప బడును. గుర్లగూబ రూపమున గల కలిని సంహరించుటకు రామ నామము కిరాతుని వంటిదని తులసీదాసు పలికెను. సూర్యుని ప్రకాశ ప్రభావముచేతను, అగ్ని కాంతి పుంజముల ద్వారా కటిక చీకట్లు పోవునట్లు రామ నామ సంకీర్తన ద్వార సంసార రూప మనెడు కారు చీకట్లు తొలుగును. ఎవరి అజ్ఞ చేత సూర్య నారా యణుడు తన దీప్తి మంతమగు కాంతి పుంజముల, చంద్రుడు, శీతలామృత కిరణముల ద్వారా చరాచర జీవుల తాపములు పోగొట్టు చున్నాడో సముద్రుడు చెలియలి కట్టను ఎవరి మాటకు లోబడి దాటుటలేదో, అష్ట దిక్పతులు వారి వారి కార్యములను ఎవరి ఆజ్ఞలచే నెరవేర్చు చుండిరో, అనంత శేషుడు, భూ భారమును ఎవరి ఆదేశానుసారము వహించు చుండునో అట్టి భగవంతుడగు శ్రీరామచంద్రుని భజించిన మీకును, సాలోక్య, సామీప్య, సాయుజ్య, యుక్తులు లభించుటలో యిసుమంతయు సందేహము లేదు.

బాల బాలికలారా! హనుమంతుని జయించిన విద్యతో పాటు చతురత గలవారుగ నుందురు. గ్రహ బాధ నుంచి తప్పించు కొందురు. రోగ బాధలు పోగొట్టుకొనెదరు. అష్ట సిద్ధులు నవ నిధులకి క్షోదయురని శ్రీ తులసీదాసు గారు చెప్పిరి గదా!

## పూజా విధానము

ఆషాఢ శుద్ధ ఏకాదశి నుండి కార్తీక శుద్ధ ఏకాదశి వరకు (121 దినములు) ప్రతి దినము 108 తులసీ దళములపై గాని,

నాగవల్లి దళములపై గాని రామ నామమును లిఖించి, ఓం హను మతే నమః అని చెప్పుచు హనుమంతుని తలపై నుంచవలెను.

ఇట్లు చేయగా చేయగా దుష్ట గ్రహములు నశించును. ఈతి బాధలు తొలగును. పండుగ దినములలో 5, 11, 18 మొదలు **108** వత్తుల వరకు ఆవునేతితో దీపారాధన చేసి, హారతు లిచ్చిన సర్వ శుభములు చేకూరునని హనుమదంక రచనా కారుడు చెప్పి నాడు. రోగ బాధ గాని, గ్రహ బాధలు గాని తగ్గలేదని బాధ పడక విశ్వాసమును సడలించు కొనకండి. మరల, మరల పారా యణ చేయుచునే వుండుడు. మీ కార్యములు నెరవేరుటలో యుకుమంతయు సందేహము లేదని శ్రీ నరసదాసు గారు పలికిరి.

బాలలారా ! యీ జన్మ మాటిమాటికి లభించదు. బహు దుర్లభమైనది. ఎంతో భగవ దనుగ్రహము ఉండిన గాని యీ మానవ జన్మ లభించదు. బాల హనుమంతుని ఆదర్శముగా నిలుపుకొని అతని వలె మీరును తల్లి దండ్రులకు, పెద్దలకు సేవలు చేస్తూ అపర్ణవంతులు కండి. గంపెడు గులకరాళ్ళయి నను, ఒక రత్నమునునకు సాటిరావు కదా ! కనుక నేటి నుండి హనుమాన్‌చాలీసా పారాయణ ప్రారంభించండి. సత్ఫలితమును పొందండి. విశ్వాసముతో చేసిన సర్వకార్యములు నెరవేరును. సందేహము లేదు.

ఈ గ్రంథ ముద్రణమునకు నిర్విరామముగా కృషి సల్పిన శ్రీయుతులు యం. వి. నరసింహారావుగార్కి, యస్. కోటేశ్వరరావు గార్కి, వఠెం సుబ్రహ్మణ్యంగార్కి, *M*. జనార్ధనరావుగార్కి, *K*. మహేశ్వరరావుగార్కి, వేమూరి నారాయణరావుగార్కి నా హృదయ పూర్వక నమస్కారములు సమర్పించుకొను చున్నాను. అడిగినంతనే ముఖచిత్రమును, ఈ గ్రంథము లోపల కథలకు తగ్గ చిత్రములు గీచి యిచ్చిన శ్రీ దేవిశెట్టి కృష్ణారావు (తెనాలి) గార్కి అతితక్కువ సమయములో సర్వాంగసుందరముగ ఈ గ్రంథమును ముద్రించి యిచ్చిన శ్రీ శ్రీ శిరీష ఆర్ట్సు ప్రింటర్సు తెనాలి యజమానులగు శ్రీ శ్రీ సుధాకర్‌గార్కి నాహృదయపూర్వక నమస్కారములు సమర్పించుకొను చున్నాను. వారిని భగవంతుడు ఎల్లవేళల కాపాడుగాక !

రామ నారాయణ శరణ్

**1-2-89**



# సద్గురు మహిమ

వంగదేశములో సనాతన సాంప్రదాయము గల ఒక గురు పీఠము కలదు. ఆ పీఠమునకు శిష్యులే పరంపరగా అధికారులగు చుండిరి. అట్టివారిలో విష్ణుదత్తు ఆ గురుపీఠమునకు అధికారి అయ్యెను. వారికి ఉన్నతశ్రేణి ధనవర్గీయులగు కొందరు శిష్యులు గలరు. మార్వాడి సంప్రదాయమున ప్రతి దీపావళీ పండుగకు వారివారి వ్యాపార అభివృద్ధి అనుసరించి లక్ష్మీపూజలు జరుపుకొను ఆచారము కలదు. అట్టి సమయములలో వారివారి గురువులను గృహములకు రావించుకొని, గురుపూజలు నెరవేర్చుకొని మిఠాయి, ప్రసాదమును పంచుకొని తాము తరించునట్లు భావించుకొను చుండెడివారు.

ఆనాడు దీపావళి పర్వదినము. అది సంధ్యా సమయము. ఆ ధనిక వర్గములోని ఒక శిష్యుడు తనకు గల ఏకైకబిడ్డకు రత్నములు, మాణిక్యములు, కెంపులు మొదలగు వస్తువులను బంగారముతో పొదిగి, వానిని ధరింపజేసి "నాన్న! బాబూ! పూజ్యులు మనకు తల్లీ, తండ్రి, మిత్రుడగు శ్రీ గురుదేవుల వారికి నీ ఈ ఆభరణములు జూపి శుభాశీస్సులను, దీవెనలను పొందిరమ్ము! అట్టి మహాత్ములైన గురుదేవుల ఆశీస్సులను పొందిన ఈ సంవత్సర కాలము సర్వశుభములతో గడచును" అని పలికెను. ఆ బాలుడు సంతసించి గురువుగారి వద్దకు వెడలి సాష్టాంగ దండ ప్రమాణము జేసి "గురుదేవా! తమరి దివ్య ప్రభావము చేత నా

జన్మ తరించినది. మా తల్లిదండ్రులు తమ దివ్య ఆశీస్సులు పొందమని పంపిరి" అనెను.

శ్రీ గురుదేవులు ఆ బిడ్డను ఆశీర్వదించిరి కానీ ఆ పసి బాలునిపై ఆ దివ్య ఆభరణములను జూచుటచేత వికార భావములు కలుగసాగినవి. [ఆహార దోష ప్రభావము] ఆ పసిబిడ్డను ప్రతినిత్యము తను పూజించుకొనుచున్న కాళీమాత విగ్రహము వద్దకు తీసికొనివెళ్ళి "నాన్నా! అమ్మవారికి సాష్టాంగ ప్రణామము చేయుము. నిన్ను అమ్మవారు అనుగ్రహించ గలదు." అని పలుక- ఆ బాలుడు సమస్కరించు చుండ అచ్చటవున్న కత్తిని దీసి మెడపై వేయ తల-మొండెము వేరయ్యెను. వెంటనే ఆ ఆభరణములను దీసి ఒక పెట్టెలోపెట్టి దాచి, ఈ మొండెము, తలను వేరొక భోషాణము నందు పెట్టి తాళము వేసెను.

కాలాతీతమైనందున తల్లిదండ్రులు ఆందోళన పడుచుండిరి. కానీ గురుదేవుల దగ్గర ఉన్నందువల్ల ధైర్యముగనే ఉండిరి. కొంత సమయము తర్వాత తల్లికి అధైర్యము గలిగి గురువుదగ్గరకు బయలుదేరిరి. వారు శ్రీ గురుదేవులను దర్శించి నమస్కరించి "గురుదేవా! మన చిరంజీవి తమరి దర్శనార్థము వచ్చినాడు గదా! తమరి ఆశీస్సులు పొందినాడు గదా! ఇక వాని జీవితము శుభ ప్రదము, కళ్యాణ ప్రదము అగుటలో ఆశ్చర్యము లేదు" అని పలికిరి. "గురు సమ దాతా కోఉ నహీ, గురుహీ! పరమ కృపాళ్" అని ఆర్యోక్తి కదా!

వారి మాటలను విని గురువు ఆదుర్ద జెందినవాడై "శిష్యులారా! మన బాబు వచ్చినాడు, ఆశీర్వదించితిని. కానీ మనస్సులో

ఆభరణములపై దుర్బుద్ధి కలిగి ఈ కత్తితో వానిని సంహరించితిని. ఆ బాలుడు ధరించిన ఆభరణములు దాచితిని. మొండెమ్మును, తలను వేరొక పెట్టెలో పెట్టితిని" అని పలికినాడు. ఆ మాటలకు ఆ బాలుని తల్లిదండ్రులు బాధజెందక "మా గురువు చంపువాడు కాడు, మా వంశమునే రక్షించునట్టి పరమపూజ్యులు. అట్టి గురువు మా ఈ బాలుని చంపెనని పలికినే ! మేము నమ్ముట లేదు అని పలికిరి. గురువు 'నిజముగా చంపితినని' పలికి వాని మొం డెము, శిరస్సు గల ప్రదేశములను జూపినాడు. అయినను వారు బాధజెందక, రోదన చేయక, వారి ఇష్ట దేవతానామమును స్మరిం చుకొనుచు గంగా సాగరము వద్దకు వెడలి స్నానము చేసి, గంగా సాగర తీర్థము తీసుకొని ఆశ్రమమునకు వచ్చిరి.

వారిబిడ్డను, శిరస్సు ఒకటిగా పెట్టి గురువు గారికి ఆసనమును ఎత్తుగా ఏర్పాటుజేసి ఆ మృత శరీరముపై వారి పాదములను వుంచి ఆ పాదములపై "నగురోరధికం", "నగురోరధికం", "నగురో రధికం" అని బిగ్గరగా జపించుచు, ఆ సాగర జలమును గురు దేవుల పాదములపై పోయుచుండ - ఆ జలము మృతశరీరముపై పడసాగినది. ఆ బాలుడు గురుపాద తీర్థప్రభావముచేత నిదురించు చున్న బాలునివలె లేచినాడు. గురువునకు ఆశ్చర్యము కలిగినది. కానీ తల్లిదండ్రులకు గలుగలేదు. గురుమంత్ర ప్రభావమువలన మృతుండైనను బ్రతుకునని వారి విశ్వాసము !

గురువునందున, మంత్రమునందున విశ్వాసములేనిదే ఎన్ని జప తప సాధనములు జేసినను గురువు అనుగ్రహములేనిదే సద్గ తులు పొందజాలడు ! గురువు అనుగ్రహములేని వ్యక్తి చంద్రుడు

లేని రాత్రితో సమానము ! నియమ బద్ధముగా గురునామమును నమ్మి జపసాధనము చేసిన పై మృతబాలుని బ్రతికించినట్లు బ్రతి కించుటలో ఏమి ఆశ్చర్యము గలదు ! కావున పరమ భక్తులారా ! గురువునందును గురుమంత్రము, విశ్వాసము ఉంచండి ! మీ మీ కోరికలు నెరవేర్చుకొని సత్ఫలితములు పొంది, మానసిక శాంతిని పొందెదరుగాక !

శ్రవణభక్తి వలన పరీక్షిత్తు, కీర్తన భక్తివలన శ్రీశుకుల వారును, స్మరణ భక్తివలన ప్రహ్లాదుడు, పాధసేవనము వలన శ్రీ లక్ష్మీదేవి, అర్చనభక్తి వలన పృధుమహారాజు వందనభక్తివలన అక్రూరుడు, దాస్యభక్తి వలన హనుమంతుడు, సఖ్యభక్తి వలన అర్జునుడు, ఆత్మ నివేదనము వలన బలిచక్రవర్తి మొదలుగా గల భక్తులెల్లరకు మోక్షమును కలిగినట్లు భాగవతాది మహా గ్రంథ ములు, భక్తులు చెప్పుచున్నారు గధా !

అహంకార రహితులై, సంకల్ప వికల్పము లేక గజేంద్రుని వలె, ద్రౌపదివలె భగవంతుని శరణు పొందుము. నీకు శుభములు గలుగును. సంసార సముద్రమును సులభముగ దాటెదవు. నేటి నుండియే భగవన్నామమును స్మరించండి. పుణ్య కార్యములు చేయుండి. భగవంతుని శరణు వేడి దివ్యసుఖములు పొందండి.

చాతక పక్షి స్వాతి చినుకుల, చక్రవాకము సూర్యకిరణ ముల, చకోరము చంద్ర కిరణముల పానము చేయునట్లు మీరున్ను భగవన్నామామృతమును (తైలధారవలె) ఎడతెరపి లేక పానము చేసి తరించండి. మానసిక బాధలు పోగొట్టుకొండి. అని శ్రీరామ శరణు మహోదయుల ఉవాచ.

హనుమంతుని వంటి మంచిమిత్రుని మంత్రిగా గలిగి యుండుట చేతనే సుగ్రీవుడు భార్యను, రాజ్యమును, పొంద గలిగెను గదా ! ఆంజనేయుని వాక్పటిమకు శ్రీరాముడు సంతసించి విభీషణుని లంకకు రాజుగా చేయుట జగమెరిగిన విషయమే గదా ! కనుక సర్వవ్యాపక స్వరూప భగవంతుడగు హనుమంతుని ఆశ్రయింపుడు. అగ్నియొక్క ప్రకాశము వలన, సూర్యోదయము వలన కటిక చీకట్లు పోవునట్లు సజ్జన సహవాసము వలన మానసిక శాంతి, సుఖము, ఆనందము కలుగుటలో ఆశ్చర్యమేమియు లేదు అదే విధముగా. ఇహలోక, పరలోక సుఖమును పొందవలెనన్న, శ్రీరామదర్శనము లభించవలెనన్న హనుమంతుని భజించవలెను.





భగవాన్ శ్రీ సత్య సాయిబాబావారితో
శ్రీ శ్రీ రామశరణ్ గురుదేవులు



గ్రంథకర్త మాతా-పితరులు



గ్రంథకర్తతో కార్యకర్తలు

# 1. హనుమంతుని అనుగ్రహము




భగవంతుని అనుగ్రహము ఎప్పుడు ఎవరిపై ఏ విధముగా వుండునో ఎవరికిని తెలియని విషయము. అట్లు అనుగ్రహము వున్న వ్యక్తులు వారి అనుభూతులు చెప్పుచున్న వినువారి శరీర ములు పులకాంకిత మగుట ఎవరికి వారు ఎరిగిన విషయమే.

రాజస్థాన్ స్టేట్‌లో లక్ష్మణగడ్ అను గ్రామము కలదు. ఆ గ్రామములో బాబు శివదత్తరాయజీ సోమాని అను పెద్ద వ్యాపారి కలడు. అతనికి నవలరాం సూరజమల్ అను పుత్రుడు కలడు. వారి ఇంటికి రెండు కిలోమీటర్ల దూరములో పాడుబడిన కోటి అను పేరుగల భావి కలదు. ఆ భావిలోని నీరు కొబ్బరినీటి వలె మిక్కిలి తియ్యగా ఉండును. అది కొంత కాలమునకు

దరులు విరిగి పడుటచే పూడికతో నిండి యున్నది. ఆ గ్రామ స్థులు ఆ గ్రామమున వూడ్చిన దుమ్మును, పనికి రాని వస్తువులను ఆ భావిలో పారవేయు చుండెడి వారు.

సూరజ్‌మల్ కుమారుడైన గణపతిరాయ్ అను బాలునకు ఆరు సంవత్సరముల వయస్సు కలదు. అతనిని వాని తండ్రి ఒకనాడు చితుక బాదినాడు. ఆ బాలుడు ఇంటి నుండి తప్పుకొని పారిపోయినాడు. అతని తల్లి తండ్రులు, బంధువులు నాలుగు వైపుల అన్వేషించిరి. కుర్రవాని జాడ తెలుసుకొనలేక నీరసపడి ఇంటికి చేరి మానసిక అశాంతితో కూర్చొండిరి. అన్నపానీయములు తీసుకొనలేదు.

ఈ పాడు బడిన బావి జోషి అనే రైతు పొలములో కలదు. అది లక్ష్మణగడ్‌కు దక్షిణ, తూర్పు కోణములో కలదు. ఆ భావి చుట్టూ పచ్చిక భూమి ఉండుట చేత వర్ష ఋతువు నందు గొల్లలు వారి వారి గొర్రెలనటకు తోలుకొని వెళ్ళి మేపుకొను చుండెడివారు. మేకలు, వాని పిల్లలు గడ్డిని తినుచూ ఆ భావి మీదుగా అటునిటూ దూకు చుండెడివి. ఆ భావి అనేక సంవత్సరముల నుండి పాడు బడి లోనికి పోవుటకు వీలులేని విధముగా రాళ్ళచే నాల్గు వైపుల కప్పబడినది. నీరు తక్కువగా వున్నది. అక్కడక్కడ పెద్దపెద్ద రాళ్ళ తొర్రలు కలవు. ఆ గ్రామ ప్రజలు వారి వారి ఇండ్లలోకి వచ్చిన పాములు, ఎలుకలు, తేళ్ళు మొదలుగా గల జంతువులను చంపక పట్టుకొని వచ్చి ఆ పాడుబడిన బావిలో వేసెడివారు. అది మిక్కలి లోతు కలిగిన భావి. దాని ఒడ్డున ఉండి కిందికి చూచిన భయము గొల్పెడిది.

ఆ భావి పాడుబడి యుండుటచే దానికి నాల్గువైపుల నుండి గడ్డి, గాదము చెట్లచేత నిండి యున్నది. గొర్రెలు, మేకలు ఆ గడ్డిని తినుచూ దానిపై ఎగురుచూ అటు నిటు తిరుగుచుండెడివి. గణపతి రాయ్ అను కుర్రవాడు కూడా ఆ మేకలు వెడలునట్లు పాడుబడిన భావి అని తెలియక ఆ గడ్డిపై కాలు పెట్టినాడు. భావిలో పడినాడు. ఈ విషయము ఎవరికిని తెలియదు.

మూడు రోజులు గడిచినవి. ఒక మేక గడ్డిని తినుచూ భావి మీదుగా దుముకుచూ వెడలుచుండగా ఆ గొర్రెల కాపరి ఆ మేక వైపు రాయి విసిరినాడు. అరాయి నీటిలో పడినది. దాని చప్పుడు విన్న ఆ బాలుడు నన్ను బయటకు తియ్యవా! అన్న మాటలు వినవచ్చినవి. ఆ కాపరి ఈ మాటలు వినుటచేత ఏదో దెయ్యము మాట్లాడుచున్నట్లు భయపడి పరిగెత్తి గ్రామస్తులకు భావిలో మానవుని మాటలు వినిపించుచున్నట్లు చెప్పినాడు. ఆ మాటలు విని వారు ఎల్లరు అశ్చర్యము చెందిరి. ఈ విషయము గణపతి రాయ్ తల్లి తండ్రులకు తెలిసినది. వారు ఈ వింతను చూచుటకు అందరితో పాటే వచ్చిరి.

ఈత వచ్చిన వ్యక్తి ఆ భావిలోనికి దిగినాడు. నాల్గు వైపుల వెదకినాడు. ఈ వింతను చూచుటకు ఎందరో వచ్చిరి. వచ్చిన వారిలో రాజస్థాన్‌లో ప్రముఖ ఆయుర్వేద కాలేజీ ప్రధానోపాధ్యాయుడు వచ్చినాడు. ఈ వింతను చూచుచున్నాడు. ఆ ఈత వచ్చిన వ్యక్తి నీటి అడుగునకు వెడలి మరల పైకివచ్చు చుండెను. గాని ఆ భావిలో మాట్లాడు బాలుడు కనిపించలేదు. ఆ భావిలో ఎక్కువ భాగము కొబ్బరి పీచుతో నిండి యున్నది.

ఆ ఈతగాడు ఎంతో కష్టపడి ఈదుచుండెను. ఆ గజపతి రాయ్ అను బాలుడు మరల నన్ను పైకి తియ్యవా అని బిగ్గరగా అరుచు చుండెను. ఆ గజ ఈతగాడు ఏదో దయ్యము మాట్లాడు చున్నదని నన్ను తాడువేసి పైకి తీయుడని అరువ సాగినాడు.

మరల ఆ బాలుడు ఇట్లు పలకసాగినాడు. నేను దెయ్య మును కాను. నా పేరు గజపతిరాయ్. నన్ను పైకి తియ్యండి. నేను మూడురోజుల నాడు ఈ బావిలో తెలియక పడినాను. అని మరల పలికినాడు.

ఆ మాటలు విన్న గజ ఈతగాడు ఆ శబ్దము వచ్చుచున్న ప్రవేశమున చూడగా ఒక పెద్ద తొర్రలో ఇరుక్కొని వున్నాడు. ఆ బాలుని ఆ ఈతగాడు బయటకి తీసుకొని వచ్చినాడు. ఎండకు తట్టు కొనలేక బాధపడుచుండ ఆ పిల్లవానికి అచ్ఛాదన ఏర్పాటు చేసిరి. అతడు ఎండబారి నుండి కాపాడ బడినాడు. అప్పుడు ఒక వైద్యుడు దగ్గిరికి చేరి ఉపశమనమును కలిగింప చేయుచూ ఇట్లు అడుగ సాగినాడు.

వైద్యుడు :- బాబూ! ఈ మూడు రోజుల నుండి బావిలో ఎట్లు కాలము గడిపితివి ?

బాలుడు :- నేను బావిలో క్షేమముగానే వున్నాను. నాకు ప్రతి దినము ఎర్రని మూతి, ఎర్రని లంగోటి, పొడగాటి తోక గల వ్యక్తి నన్ను తొడపై కూర్చుండ బెట్టుకొని నా నోటిలో ఆహారము పెట్టు చుండెడి వాడు. నాతో ఆటలు ఆడు చుండెడి వాడు. నన్ను నవ్వించుచూ, తాను కూడా నవ్వు చుండెడివాడు. నేనా బావిలో పడునపుడు

ఒక వానరాకారుడు సాకార మానవుడై వచ్చి నన్ను పట్టు కొని, ఈ పాడు పడిన గుహలో పెట్టినాడు. తల్లి వలె నన్ను ప్రేమించు చుండెడి వాడు. ధైర్యము చెప్పు చుం డెడివాడు. అని ఆ బాలుడు చెప్పుచుండ అచ్చట వారు విని ఆశ్చర్యము చెందిరి. వారి వారి హృదయములు భక్తితో నిండి కంఠములు గాద్గదికమైనవి. మహావీర బజ రంగ బలికి జై అని కేకలు వేసిరి.

అక్కడ పెద్ద హనుమాన్ మందిరము కట్టిరి. సూరజమల్ గారు జీవించినంత కాలము ప్రతి మంగళ, శని వారములు విశేష పూజలు చేసెడి వారు. భక్తుల కోర్కెలు నెరవేరు చుండెడివి. ఆ వచ్చిన భక్తులెల్లరు ఆవు నేతితో దీపారాధనలు చేసి స్వామికి పండ్లు, లడ్లు, పానకము, వడపప్పు నివేదనలు చేసి భజనలు, కథా కాలక్షేపములు చేసి వారి వారి గృహములకు వెడలు చుండెడి వారు. సుఖము, సంతోషముగా వారు కాలమును గడుపు చుండిరి.

బాలులారా! భక్తులారా! హనుమంతుని అనుగ్రహము ఎట్టిదో చూడుడు. మీరును హనుమాన్ చాలీసా పారాయణ, రామ నామ లేఖనము వ్రాసి దీనజన రక్షకుడగు హనుమంతుని దయకు ఏల పాత్రులు కారాదు. నేటి నుండి ప్రారంభించండి.



# 2. యయాతి మహారాజుకు హనుమంతుడు ప్రాణ దానము చేయుట



*శ్లో॥ మారుతిం, వీరవజ్రాంగం, భక్త రక్షణ దీక్షితమ్।*
*హనూమంతం సదా వన్దే రామచంద్ర ప్రచారకమ్॥*

*(సిద్ధాంత దీపిక)*

ఒకానొక సమయమున హనుమంతుడు తన మాతృదేవత యగు అంజనాదేవి దర్శనార్థము వెడలుటకు శ్రీరామచంద్రుని అనుజ్ఞను ప్రసాదింపుమని కోర వెడలిరమ్ము అని పలికినాడు.

యయాతి మహారాజు అదే సమయమున శ్రీరామచంద్రుని దర్శించుటకు వచ్చుచుండ, మార్గ మధ్యమున నారద మహర్షి కలువ హృదయ పూర్వకముగా వారికి నమస్కరించినాడు.

అప్పుడు నారద మహర్షి రాజుతో ఇట్లు పలికినాడు. మహారాజా! నీవు ఎక్కడకు వెడలుచున్నావు? అని పలుక, శ్రీరామ చంద్రుని దర్శనార్థము వెడలు చున్నానని ప్రత్యుత్తరము ఇచ్చినాడు.

నారదుడు అతని మాటలకు సంతోషించి, మహారాజా! పదునాల్గు భువన భాండములకు సృష్టికర్త యగు శ్రీరామ చంద్రుని దర్శించుటకు వెడలు చుంటివి కనుక నా చిన్నపని నెర వేర్చి పెట్ట వలసినది అని పలికినాడు.

ఆ మాటలకు కాశీరాజు సంతోషించి ఓ మహర్షి! ఈ భూ మండలముపై మీ కార్యము చేయని వాడు ఎవడుండును? మీరు చెప్పిన కార్యమును నేను అవశ్యము నెరవేర్తును. నా అదృష్ట ముగా భావింతును. మీ కార్యము నెరవేర్చి నేను ధన్యుడ నగుదును.

నారదుడు నవ్వుచు ఇట్లు పలికినాడు. మహారాజా! శ్రీరామ చంద్రుని దర్శించిన వెంటనే నీవు ఆ దివ్య పురుషుని చరణ కమల ములకు సాష్టాంగ నమస్కారము చేయుము. వారి ప్రక్కనే కూర్చుండి ఉన్న వయోవృద్ధుడు తపస్సంపన్నుడగు విశ్వామిత్ర మహర్షికి నమస్కరింప వలదు అని పలికినాడు.

ఓ నారద మహర్షి! అది ఎట్లు సంభవ మగును. మహా త్ముని అట్లు చేసిన అగౌరవ పరచడమే కదా! అన దీనికి సమా ధానము ముందు ముందు లభింప గలదు. అని నారద మహర్షి పల్కినాడు.

హరి! హరీ! అనుచు నారదుడు అచ్చట నుండి వెడలి నాడు. కాశీ మహారాజు శ్రీరామ చంద్రుని కొలువు కూటమునకు చేరి శ్రీరామ చంద్రుని పాద పద్మములకు సాష్టాంగ నమస్కారము చేసినాడు. నారద మహర్షి అజ్ఞానుసారము వయో వృద్ధుడు జ్ఞాని అగు విశ్వామిత్ర మహర్షికి నమస్కరించకయే సభలోనికి వచ్చి తన ఆసనముపై కూర్చుండినాడు.

కాశీరాజు తనకు నమస్కరింప కుండుటచే విశ్వామిత్ర మహర్షికి మిక్కిలి కోపము వచ్చి శ్రీరామ చంద్రునితో ఇట్లు పల్కినాడు.

శ్రీరామచంద్రా! నీవు మర్యాదా పురుషోత్తముడవని ప్రజలు చెప్పుకొనుట జగమెరిగిన విషయమే. ఈ కాశీరాజు నీకు నమస్కరించి గురువు నగు నాకు నమస్కరించక సభలోనికి వెడలి కూర్చుండి నాడు. అట్టి గురుద్రోహిని నీవు ఉపేక్షించెద వేల ? అట్లు చేయుట నీకు ఇష్టమేనా ? అని పల్కినాడు.

గురుదేవా ! నా ఎదుటనే మీకు అవమానము జరిగినదా ! ఎప్పుడు, ఎక్కడో సెలవిండు. రామా ! ఈ సభలోనే ఈ కాశీ మహారాజే అట్లు చేసినాడు. అట్లు చేయుట ధర్మయుక్తము కాదు. అందులకు నాకు అశాంతిగా ఉన్నది.

స్వామీ ! గురుదేవా ! మహాత్మా ! అట్టి గురుద్రోహిని సంహరించి తీరవలసినదే. నిండు సభలో గురువునకు నా సమక్షములోనే అవమానము చేయుటమా ! సహింపరాని నేరము. అట్టి వాడు ఎంతటి మహోన్నతుడయినప్పటికినీ నా ఈ మూడు బాణములతో సూర్యాస్తమయంలోగా మీ పాదసాక్షిగా సంహరింతునని ప్రతిజ్ఞ

చేయుచున్నానని శ్రీరామచంద్రుడు పల్కినాడు. ఆ మాటలు ఋషి విని ప్రశాంత చిత్తుడయి నాడు.

మిక్కిలి పరాక్రమ సంపన్నుడు, సత్యవ్రతుడు, మేటి బల వంతుడు రాక్షస రాజయిన రావణాసురుని సంహరించిన వాడగు శ్రీరామచంద్ర మహారాజు యొక్క ప్రతిజ్ఞ వాయు వేగము వలె ఆ రాజసభ ప్రాంగణ మంతయు వ్యాపించినది. కాశీరాజగు యయాతి ఈ శ్రీరామచంద్రుని ప్రతిజ్ఞను విని మిక్కిలి భయ కంపితుడైనాడు. నోటి నుండి మాట పెగలడం లేదు. తన జీవనంపై నిరాశ కలిగి, పరుగిడి పరుగిడి బ్రహ్మ మానస పుత్రుడును, భక్త శ్రేష్ఠుడును అగు నారద మహర్షి పాదములపై బడి గడగడ వణకుచూ తడబడు మాటలతో ఇట్లు పల్కినాడు.

ఓ నారద మహర్షీ ! సత్య ప్రతిజ్ఞుడగు శ్రీరామచంద్రుడు సంధ్యా సమయము లోపల నన్ను సంహరింతునని ప్రతిజ్ఞ చేసి నాడని రాజు పల్క, నేనును వింటిని మహారాజా ! అని తటస్థ భావముతో సమాధానము ఇచ్చినాడు.

ఓ మహారాజా ! రఘు వంశస్థులు ఎవరైనను ప్రతిజ్ఞ చేసిన యెడల వారి మాట నెరవేరు వరకు విశ్రమించరు. అందున సృష్టి స్థితి, లయ కారకుడగు శ్రీరామచంద్రుని ప్రతిజ్ఞ కదా ! నీ శిరస్సు ఖండించియే తీరునని నారదుడు పల్కినాడు.

ఓ భక్తశ్రేష్ఠ ! నారద మహర్షీ ! మీ మాటను నేను పాటిం చుటచేత నాకీ దుర్దశ కలిగినది. లేని యెడల నాకిట్లు సంభవించదు కదా ! అని యేడ్చుచు నారదుని పాదములపై బడి నాప్రాణము లను ఎటులైనను కాపాడుడని రోదన చేయసాగినాడు.

మహారాజా! దుఃఖింపకుము అని కాశీరాజును ఓదార్చుచు యయాతి మహారాజా! పుట్టిన మానవుడు గిట్టక తప్పదు. ఈ సృష్టిలో పుట్టిన ప్రతిజీవి యమపాశముల బారి నుండి తప్పించు కొనలేదు కదా! అందువలన శ్రీరామచంద్రుని బాణా ఘాతము నకు నీ ప్రాణములు అహుతి అగునేని నీ జీవితము ధన్యము అగుటలో సందేహము లేదు. త్రితాపముల బారినుండి సాలోక్య, సామీప్య, సాయుజ్య ముక్తులు నీకు కల్గి తీరును. నీ జీవితము ధన్యమగును. నీవు భయపడకుము అని నారదుడు పల్కి ఏ విధ ముగానైనను శ్రీరామచంద్రుని శరాఘాతము నుండి తప్పింపుడని కాశీరాజు పల్కినాడు.

నారదమహర్షి నవ్వుచు మెల్ల మెల్లగా ఇట్లు పల్కసాగినాడు. నీ ప్రాణమును కాపాడబడ వలెనన్న నేను చెప్పినట్లు వినుము.

సరయూనదీ తీరమున రామ్‌ఘాట్ నందు హనుమంతుని తల్లి అగు అంజనాదేవి తపస్సు చేసికొను చున్నది. నీవు ఆమె సమీపమునకు వెడలి రక్షింపుము, రక్షింపుము అని బిగ్గరగా కేకలు వేయుచు ఆమె చరణములను పట్టుకొనుము. నిన్ను ఆమె రక్షింతునని మాట ఇచ్చును. మూడు సార్లు రక్షింతును, రక్షింతును, రక్షింతును అని పలుకనిదే నీవు ఆమె పాదములపై నుండి లేవకుము. అప్పుడు నీ కార్యము నెరవేరి ప్రాణరక్షణ జరుగును.

కాశీరాజు నారద మహర్షి పాదములకు నమస్కరించి వెను తిరిగి ప్రాణ భయముచే రోదన చేయుచు, రామనామ జపము చేసి కొనుచు కన్నులు మూసికొని ఉన్న అంజనాదేవి దగ్గరకు వచ్చి ఏడ్చుచు ఆమె పాదములపై బడి రక్షింపుమని ప్రాధేయ పడినాడు.

ప్రాధేయపడుచు నా ప్రాణముల రక్షింపుమని ముమ్మారు పల్కి నాడు.

ఆ మాటలు అంజనాదేవి విని ఎవరు నాయనా నిన్ను చంపు నది నా ఆధీనములో గల నిన్ను చంపు బలశాలి ఎవడు ? అని పల్కినది. ఆ మాటలకు యయాతి ఒక సమర్థ వ్యక్తి, మిక్కిలి బల సంపన్నుడు, సత్య వ్రతుడునగు నట్టి పురుష శ్రేష్ఠుడు నన్ను సంధ్యా సమయము లోగా సంహరింతునని ప్రతిజ్ఞ చేసి నాడు. అందుకు నిన్ను శరణు వేడుచున్నాను. నీవు తప్ప నన్ను కాపాడు వారు ఎవరు లేరు. అమ్మా నన్ను రక్షింపుము, రక్షింపుము, రక్షింపుము అని పల్కినాడు.

ఎవరు ? ఎందుకు నిన్ను చంపుదురు ? ఎందుకు ప్రతిజ్ఞ చేసిరి ? అని అంజనాదేవి పల్కినది. కాశీరాజు ఆమె మాటలకు చకితుడై ఏడ్వ సాగినాడు. అమ్మా నీవు రక్షింపవేని నీ పాదముల వద్దనే ప్రాణములు వదులుటకు నిశ్చయించు కొంటిని.

ఆ మాటలకు అంజనాదేవి ఇట్లు పల్క సాగినది. నాయనా ! బిడ్డా ! నా ప్రాంగణములో నా రక్షణలో ఉన్న నిన్ను సంహరించు ధైర్యము ఎవరికి కలదు. నీ ప్రాణము రక్షింతునని అభయమిచ్చు చున్నాను అని పల్కినది.

కాశీరాజు మాటి మాటికి ఏడ్చుచు అమ్మా ! నువ్వు చెప్పిన మాటల వల్ల నాకు సంతోషము కలుగుట లేదు.

అందుకు గాను నా తృప్తి కొరకు నీవు ముమ్మారు నీ ప్రాణములను రక్షింతునని శపథము చేసిన నాకు తృప్తి కలుగునని ప్రాధేయ పడసాగినాడు,

నాయనా! బిడ్డా! నీ ప్రాణములను రక్షింతును. అని ముమ్మారు పల్కి నిన్ను ఎవరు చంపుదురు. అట్లు చంపుటకు కారణమేమిటో నాకు తెలియ చెప్పుము.

అమ్మా! భగవత్ స్వరూపుడగు శ్రీరామచంద్రుడే నన్ను ఈ రోజు సూర్యాస్తమయం లోగా సంహరింతునని ప్రతిజ్ఞ చేసి తీక్షణములగు మూడు బాణములు ప్రక్కన పెట్టినాడు అని రాజు పల్కినాడు.

ఆ మాటలు అంజనాదేవి విని, శ్రీరామచంద్రుని ప్రతిజ్ఞ ఎట్లు వృథా అగును? అని విచార గ్రస్తురాలై బాధపడుచు ఇట్లు పల్కినది. నాయనా! నీకు రక్షింతునని మాట ఇచ్చితిని. నీ ప్రాణ ములు శ్రీరామ శరాఘాతమునకు ఆహుతి కాకుండా ఉండుటకు ప్రయత్నము చేసెదనని పల్కినది.

ఆ సమయముననే తల్లి అగు అంజనాదేవి వద్దకు హను మంతుడు వచ్చి, ఆమె పాదములకు సాష్టాంగ నమస్కారము లొనర్చి నిలుచుండి యుండ, నీవు తగిన సమయములో వచ్చితివి. నేనిప్పుడు అవశ్యమగు కార్యసాఫల్యము కొరకు ఆలోచించు కొనుచు నిన్ను మాటి మాటికి స్మరణ చేసితిని, నీవు వచ్చితివి. నాకు అందులకు మిక్కిలి సంతోషముగా నున్నది. నా ఈ కార్య మును నీవు నెరవేర్చితి వేని నా సంతోషమునకు హద్దులుండవు.

అమ్మా! నాకా కార్యమేమిటో చెప్పుము. నేను అవశ్యము నీ ఆజ్ఞను శిరోధార్యముగా భావించి నెరవేర్చుటకు ప్రయత్నిం తును.

నాయనా! ఆంజనేయా! నేను చెప్పబోవు కార్యము మిక్కిలి కఠినమైనది. కనుక చెప్పుటకు సందేహించు చున్నాను. అని అంజనాదేవి పల్కినది.

ఆ మాటలకు హనుమంతుడు అమ్మా! నీ పుత్రుడు విద్యా, బల, పౌరుష, పరాక్రమ సంపన్నుడు కదా! అట్టి నీ పుత్రునిపై చతుర్దశ భువనాదిపతి యగు శ్రీరామచంద్ర మహారాజు యొక్క కరుణ నిరంతరము ప్రవహించు చున్నది కదా! అట్టి నీ ఈ పుత్రునికి నీ కఠినము, కష్టతరము నగు కార్యము గురించి చెప్పుటకు ఏల సందేహించు చుంటివో నాకు అర్థమగుట లేదు. అమ్మా! దయ వుంచి నాకా పని అప్పగించుమని అడిగి నాడు.

నాయనా! ఆంజనేయా! నీ బల, ప్రతాప, పౌరుషములు నాకు తెలియునివి కావు. కాని ఈ కార్యము మిక్కిలి కఠిన మైనది. అందువలన నీతో చెప్పుటకు మనస్సు ఒప్పుటలేదు. అని అంజనాదేవి పల్కినది.

అమ్మా! నీ పవిత్ర పాద పద్మముల సాక్షిగా ఆ కార్యము ఎంతటి కఠినమైనది అయినను నేరవేర్చ గలనని ఒక పర్యాయము కాక ముమ్మారు శపధము చేసి పల్కుచున్నాను. కనుక నాకు ఇప్పుడైనను చెప్పుమని అడిగినాడు. హనుమంతుడును ముమ్మారు తెలియకయే తల్లి ఎదుట కార్యమును నెరవేర్తునని ప్రమాణము చేసినాడు.

నాయనా! ఆంజనేయా! నీవు ఆకార్యమును నేరవేర్చుటకు సమర్థుడవని నాకు తెలుసు. నీవు మిక్కిలి బల సంపన్నుడవు,

పరాక్రమ వంతుడవు. మిక్కిలి మాతృ భక్తి పరాయణుడవు. అట్టి నీకు ఈ కార్యము ఒక లెక్క లోనిది కాకున్నను చెప్పక తప్పదు అని కీర్తించుచు ఇట్లు పల్కసాగినది.

నాయనా ! అంజనేయా ! నేను కాశీ మహారాజుకు ప్రాణ రక్షణ చేయుదునని ముమ్మారు మాట ఇచ్చితిని. నేడు సాయం కాలము లోపల శ్రీరామచంద్రుడా కాశీరాజును సంహరింతునని శపథము చేసినాడట. అందుకు గాను తీక్షణ స్వభావము గల మూడు బాణములను తీసి ప్రక్కన ఉంచినాడట. ఆ విషయము నాకు తెలియక యయాతి మహారాజుకు ప్రాణధానము చేతునని ముమ్మారు పల్కితిని. నీవును ముమ్మారు పల్కితివి. ఇరువుర మును కలసి అతనిని రక్షింప వలసిన బాధ్యత కలదు.

హనుమంతుని యొక్క ముఖము గంభీరముగా నుండుటను అంజనాధేవి గమనించినది. హనుమంతునికి ఆశ్చర్యము కల్గి అమ్మా ! శ్రీరామచంద్రుని యొక్క ప్రతిజ్ఞయా ! అని పల్కి, విచార వదనుడై యుండెను.

తల్లి ఇది గమనించినది. నాయనా ! అంజనేయా ! నేను కాశీరాజునకు మాట ఇచ్చితిని. నీవు నాకు మాట ఇచ్చితివి. ఏల విచారపడు చుంటివి ? శరణాగతులను రక్షించుట మన ధర్మము నాయనా ! నీమాటను నీవు నెరవేర్చు కొనుము. ధర్మమునకు కట్టుబడుము. అని అంజనాదేవి పల్కినది. అప్పుడు హను మంతుడు అమ్మా ! నేను ఇచ్చట నుండి వెడలుటకు దయతో అనుమతి నిమ్ము ! అని పల్కెను.

తల్లి అనుమతి లభించుట తోడనే హనుమంతుడు కాశీ మహారాజును వెంట నిడుకొని అయోధ్యకు చేరి మహరాజా! పరమ పావనమగు సరయూనది లోనికి దిగి నడుములోతు గల నీటిలోనికి వెడలి నిలుచుండి అవిరామముగా రామ, రామ, రామ అనుచు రామనామము జపించు చుండుము అని రాజుతో పల్కినాడు.

హనుమంతుని ఆజ్ఞానుసారము కాశీరాజు సరయూనదీ జలముల లోనికి దిగి రామ నామము అవిరామముగా చేయు చుండెను. హనుమంతుడు శ్రీరామ చంద్రుని దగ్గరకు చేరినాడు. చేరి నమస్కరించి శ్రీరామ చంద్రా! నేడు, నేను నిన్ను ఒక వర మును కోరుకొను చుంటిని అని పల్కినాడు.

హనుమంతుడు ఇట్లు అడుగుట శ్రీరామ చంద్రునికి ఆశ్చ ర్యము కల్గి, హనుమా! నీకివ్వ దగినది నావద్ద ఏమియును లేదు. నీకు నేను ఏమివ్వ గలను? నీకు సర్వకాల, సర్వావస్థలలో శుభము కలగవలెనని కోరుకొను చుంటిని. అయినను నీవు వరము అడి గితివి కాన ఏమి కావలయునో కోరుకొనుము. నీ కోర్కెను నెర వేర్తును అని శ్రీరామ చంద్రుడు పల్కినాడు.

దయామయా! స్వామి! రఘురామా! మహా మహిమాన్వి తమగు నీ నామమును ఉచ్చరించు వానిని సర్వకాల సర్వావస్థ లలో రక్షింప వలసినది. అనిన్ని, నారక్షణలో ఉండి నీ నామమును జపించు వారల త్రికాల, త్రిసంధ్యలలో చంపవలదనిన్ని, ఒకవేళ నీవు చంపదలచిన వేసిన బాణములు వ్యర్థ మగునట్లును నాకు వరమును ప్రసాదించ వలసినది.

దయామూర్తియు, భక్త వత్సలుడునగు శ్రీరామచంద్ర మూర్తి హనుమంతుడు అడిగిన వరమును ప్రసాదించి, ఇట్లు పల్కినాడు. నాయనా! అంజనేయా! నా నామమును జపించు వారలను సర్వకాల సర్వావస్థలలో నీవు రక్షించు చుందువు. ని రక్షణలో నా నామమును జపించుచుండు వారలెవరిపైనైనను నా అమోఘ బాణ పరంపరలు వృథా అగునట్లు వరమిచ్చు చున్నాను.

శ్రీరామచంద్రునికి జయము అగుగాక ! అని పల్కి, శ్రీరామ చంద్రుని ఆజ్ఞను పొంది వెంటనే సరయూనదీ తీరమునకు వచ్చి నాడు. గదను భుజముపై ధరించి అత్యంత సావధానుడై ఓ కాశీ మహారాజా ! నీవు అవిరామముగా రామ, రామ, రామ అని బిగ్గరగా కీర్తించు చుండుము, అని పల్కినాడు.

పరిస్థితి విచిత్రముగా నున్నది. ఒక వైపున శ్రీరామ చంద్రుడు కాశీ మహారాజు తలను సాయంకాలము లోపుగా సంహరింతునని చేసిన ప్రతిజ్ఞ, రెండవవైపున అనన్య భక్తుడగు హనుమంతుడు గదను ధరించి కాశీరాజు ప్రాణములను కాపాడు దునని చేసిన ప్రతిజ్ఞ కాశీమహారాజు ప్రాణము పోవునని భయ ముతో హనుమంతుడు చెప్పిన విధముగా నిరంతరము రామ నామము చేయుట, పట్టణములో గల పెద్దలు, వయోవృద్ధులు యువకులు, బాలురు తెలిసికొని, ఈ వింత ఎట్లు జరుగునో చూచు టకు గాను వారు ఎల్లరు సరయూనదీ తీరమునకు వచ్చిరి. ప్రభువు, భక్తుల ప్రతిజ్ఞలు ఎట్లు నెరవేరునోనని, ఈ వింతను చూచుటకు జనులు వువ్విళ్ళూరు చుండిరి.

సాయంకాలమైనది ఈ విషయము శ్రీరామ చంద్రునకును తెలిసినది. తెలిసి కోపము చెంది ఆ మూడు బాణములలో ఒక బాణమును తీసి తన విశాలమగు ధనుస్సును ఎక్కుడి ఆ కర్ణాంత్రరము లాగి ఆ బాణమును వదలినాడు. అది మిక్కిలి వేగముగా సరయూనదీ జలములలో ఉండి రామ నామమును జపించుచున్న కాశీ మహారాజు దగ్గరికి వచ్చి కుత్తుకనుత్తరించుటకు ప్రయత్నము చేయుచున్నది. కాని అతడు నిరంతరము రామ నామము చేయుచుండుట చేత అతని తలను నరుక జాలకుండినది. ఆ రాజు రామనామమును ఆపిన కుత్తుకనుత్తరించవలెనని ఆ బాణము తలంపు. కాని అతను హనుమంతునిచే దీక్ష పొందినవాడు అగుట చేత ప్రాణ భయము వలన అతడు నామమును ఆపలేదు. ఆ బాణము అతని శిరస్సును ఛేదింపలేదు.

ఆ బాణము నిరాశతో శ్రీరామచంద్రుని వద్దకు చేరి ఇట్లు పల్కినది. ప్రభూ రామ నామ జపము చేయు వారలను రక్షించునట్లు హనుమతునికి వరము నిచ్చితిరి. అట్టి వారిపై ఎవరు ఏ బాణము వేసినను వ్యర్థమగునట్లు ఆశీర్వదించితిరి. కాశీ మహారాజు అనుక్షణము మీ నామమును జపించుచునే యున్నాడు. వజ్రాంగబలుడు అగు హనుమంతుడు గదను ధరించి కాశీ రాజును రక్షించు చున్నాడు. నేను అతనిని చంపజాలక వెను తిరిగి వచ్చితిని.

పతిత పావనుడు, లీలామానుష స్వరూపుడు అగు శ్రీరామ చంద్రునికి మిక్కిలి కోపము కల్గినది. రెండవ బాణమును ధనస్సుపై ఎక్కుడి వదిలినాడు. కాశీరాజును సంహరించుటకై ఆ

బాణము వాయు వేగముతో వెడలి అతని వద్దకు చేరినది. కాని ఆ రాజు హనుమంతుని ఆదేశానుసారము 'సీతారాం సీతారాం జయ సీతారాం' అను నామమును విరామము లేక కీర్తించు చున్నాడు. ఆ బాణమునకు కాశీరాజు కంఠమును నరకుటకు అవకాశము కలుగ లేదు. నిస్పృహ చెంది ఆ బాణము శ్రీరామ చంద్రుని వద్దకు చేరి 'సీతారాం సీతారాం జయ సీతారాం' అను నామమును ఆ రాజు ఎడతెరిపి లేకుండా చేయుచున్నాడని, హను మంతుడు గదను ధరించి అతనిని రక్షించుచున్న వృత్తాంతమును శ్రీరామచంద్రునికి చెప్పినది.

ఆ మాటలు సత్యప్రతిజ్ఞుడు అగు శ్రీరాముడు విని మిక్కిలి ఆగ్రహముతో స్వయముగా నేనే సరయూనదీ తటమున కెడలి హనుమంతుని, కాశీ రాజును ఈ మూడవ బాణముతో సంహరింతు నని బయలుదేరినాడు.

హనుమంతుడు సరయూనదీ తటమున ఉండి ఇట్లు ఆలో చించుచున్నాడు. శ్రీరామచంద్రునకు భక్తులనిన మిక్కిలి ప్రేమ. భక్తుల కొరకు అతడు సర్వస్వమును ధారపోయును. భక్తులనిన అతనికి మిక్కిలి ప్రియము. అందుకని ఓ కాశీ మహారాజా ! జగజ్జనని సీతాదేవి నామము, జగత్ ప్రభువగు శ్రీరామ నామముతో పాటు నా నామమును జోడించి 'జయ సియరామ్ జయ జయ హనుమాన్' అను నామమును బిగ్గరగా కీర్తించుము అని పల్కి, రాజు ఆ విధముగ కీర్తింపసాగినాడు.

కాశీరాజు ఎక్కువసేపు ఆ నామమును ఉచ్చరించుట చేత అలసి వణకసాగినాడు. ప్రాణము పోవునను భయముతో ఏదో విధముగ నామము చేయుచు, చేయుచు నీటిలో పడిపోయినాడు.

కంఠము గాద్గదికమైనది. హనుమంతుడిది గమనించి ఒక అంశతో కాశీ రాజు కంఠమున ప్రవేశించి 'జయ సియరామ్ జయ జయ హనుమాన్' నామమును అవిరామముగా చేయుచున్నాడు.

శ్రీరామచంద్రుడు మిక్కిలి ఆగ్రహముతో ధనస్సునకు మూడవ బాణమును సంధించి వచ్చుట వశిష్ఠ మహర్షి జూచి వ్యాకులత చెంది ఇట్లు ఆలోచింపసాగినాడు.

శ్రీరామచంద్రుని ప్రతిజ్ఞ వృధా కాదు. కాశీ రాజుతో పాటు హనుమంతుడు కూడా మరణించునేని మిక్కిలి అనర్థము కల్గి తీరును అని ఆలోచించి హనుమంతుని దగ్గరకు వెడలి వశిష్ఠుడు ఇట్లు పల్కినాడు.

ఓ హనుమంతా ! శ్రీరామచంద్రుడు నీకు ప్రభువు, సర్వ స్వామునై ఉన్నాడు. కనుక అట్టి ప్రభువు మాట నెరవేర్చుకో నిమ్ము. సూర్యుడు అస్తమించుట చేత ఆయనకు క్రోధము పెరుగుచున్నది. ఈ కాశీరాజు శ్రీరామచంద్రుని యొక్క పరమ పావనమగు బాణాఘాతము చేత మరణించినేని అతనికి చావు పుట్టుకల బాధ తప్పును. ముక్తి పొందును. ఒకానొక రాజు కొరకు నీవు నీ ప్రభువుకు, ఎదురు తిరిగి యుద్ధము చేయుట నీలాంటి సేవకునకు ఉచితము కాదు.

ఓ గురుదేవా ! సర్వసమర్థుడు, త్రికాలజ్ఞుడు అగు శ్రీరామ చంద్రునికి ఎదురు నిలబడి యుద్ధము చేయవలెననెడి తలంపు నాకు లేదు. నేను నా ప్రభువు నామము కొరకు నాకిచ్చిన వరదాన రక్షణ కొరకు ప్రాణమును త్యజించుటకు సన్నద్ధుడనై యుంటిని. నాకు శ్రీరామ చంద్రుని చేతిలో మరణించుటకన్న సౌభాగ్యము

ఏమి కలదు ? నా ప్రాణముల కన్నా శ్రీరాముని నామమే నాకు మిక్కిలి ప్రియమైనది. వరదాన రక్షణ కొరకు శ్రీరామ చంద్రుని బాణ పరంపరకు నా ప్రాణముల నొదలి నా ప్రభువులో విలీన మయ్యెదను. శ్రీరామ చంద్రునితో యుద్ధము చేయనని అతి విన యముగా సమాధానము చెప్పెను.

బుద్ధిమంతులలో బుద్ధిమంతుడు, జ్ఞానిలో జ్ఞాని అగు హను మంతుని మనస్సు మారదు అని వశిష్ఠుడు భావించి, అయోధ్య వైపు చూడ శ్రీరామచంద్రుడు సరయూనదీ తీరమునకు వచ్చు చున్నాడు. వారితో పాటు విశ్వామిత్ర మహర్షి, మిగిలిన మహర్షులు వాడు వీరు అనక ప్రజలెల్లరు ఈ వింతను చూచుటకు వచ్చు చుంటిరి.

ఇది భక్తికి, భగవంతునకు జరుగు సమరము. ఇది చూచు వారలకు ఆశ్చర్యము కలుగు చున్నది. అప్పుడు వశిష్ఠ మహర్షి కాశీ మహారాజు వద్దకు వెళ్ళి ఇట్లు పల్కినాడు.

ఓ రాజా ! నీవు వెంటనే వెడలి విశ్వామిత్ర మహర్షి పాద ములను పట్టుకొనుము. అతడు మిక్కిలి దయగలవాడు. నిన్ను క్షమించును.

వశిష్ఠ మహర్షి మాటలు విని కాశీరాజు 'జయ సియరాం జయ జయ హనుమన్' అని బిగ్గరగా కీర్తించుచు, వెడలి విశ్వామిత్ర మహర్షి యొక్క రెండు పాదములను పట్టుకొని తన కన్నుల నుండి స్రవించుచున్న నీటి దారలచే విశ్వామిత్రుని పాద ములను కడిగినాడు, కాశీరాజు శ్రీరామ నామ సంకీర్తన మొనర్చుట

వలన అతని పట్ల విశ్వామిత్రునకు మిక్కిలి ప్రేమ కలిగినది. కాశీ రాజు ఏడ్చుచూ కూడా 'జయ సియరాం జయ జయ హనుమాన్' అను నామమును వదల లేదు.

విశ్వామిత్ర మహర్షి మనస్సు కరిగినది. ధనస్సునకు బాణమును సంధించి ఆ కర్ణాంతము లాగి క్రోధముతో వొదులుటకు సిద్ధముగా ఉన్న శ్రీరామచంద్రునితో విశ్వామిత్రు డిట్లు పల్కినాడు. రామా ! శ్రీరామా ! ఇతడు నన్ను శరణు వేడినాడు. ఈతడు చేసిన అపరాధమును క్షమించితిని. నీవు ఎక్కు పెట్టిన బాణమును నీ తరకసము లోనికి ప్రవేశింపజేయుము.



అని విశ్వామిత్రుడు పల్కగా, వారి అజ్ఞానుసారము శ్రీరాముడు అట్లే చేసినాడు. కోపము తగ్గించుకొన్నాడు. ప్రశాంత చిత్తుడయినాడు. కాశీ మహారాజుకు ప్రాణరక్షణ జరిగినది. భక్త రక్షకుడగు హనుమంతునకు విజయము కల్గినది.



ఈ సమాచారమును వినిన తల్లి అగు అంజనాదేవికి కలిగిన ఆనందమునకు హద్దులు లేకుండెను.



కావున బాలులారా ! మీరును భక్త రక్షకుడగు హనుమంతుడు ఎట్లు తల్లి దండ్రులకు సత్కీర్తిని తెచ్చెనో, ప్రాణముల కన్నా భక్తియే మిన్న అని ఎట్లు నిరూపించెనో మీరును భక్తులై సమాజమును ఏల ఉద్ధరింపరాదు ? మీ తల్లి - దండ్రులకు, జాతికి ఏల సత్కీర్తి తేరాదు. ఆలోచించుకొనుడు.



# 3. ఆచార భక్తి కన్నా అనురాగ భక్తియే మిన్న

భగవాన్ శంకరుడు వైరాగ్యమూర్తి, శాంతుడు, దయాసముద్రుడు, శక్తి సంపన్నుడు, సర్వేశ్వరుడైనను. స్మశానమున నివాసముండును. తెల్లని కర్పూరము వంటి ఆకార స్వరూపుడు. తెల్లని విభూతి రేఖలు ధరించు కొనును. అర్థనారీశ్వరుడు. బ్రహ్మచర్య వ్రత నిష్టాగరిష్టుడు.

కుబేరుడు సహితము పరమశివుని ఆజ్ఞల పాటించుచు లోకమునకు హితము చేయుచుండును. శివుడు పరబ్రహ్మ స్వరూపుడయినప్పటికిని సర్వకాల సర్వావస్థలలో ధ్యాన నిమగ్నుడై యుండును. శంకరుడు నారాయణుని హృదయము. (శివస్య హృదయం విష్ణుః ర్విష్ణోశ్చ హృదయుం శివః) శంకరుని హృదయమున నారాయణుడుండును. ఇరువురును ఒక్కటియే.

*(ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా)*
*భక్తచిత్తాను రోధేన ధత్తే నాగాకృతః స్వయం)*

భక్తులు బేధ మెంచరాదు. అట్లుపాసించిన వారి జీవితమే ధన్యవంతమైనది. భగవానుడగు శంకరుడెట్లు దివ్యుడో అతని భక్తులును దివ్యులే (భక్తి, భక్త, భగవంతని అని ఆర్యోక్తి గదా !) ఎవరిని ఎప్పుడెట్లు శివుడనుగ్రహించునో ఎవరికిని తెలియదు. వారి వారి పూర్వ సంస్కారానుభవము ననుసరించి భగవంతుని అనుగ్రహము లభించును.

పూర్వకాలములో నందీవైశ్యుడను భక్తుడొకడు గలడు. అవంతీ నగరమున ఆయన నివాసముండెడివాడు. మిక్కిలి ధనవంతుడు. సదాచార సంపన్నుడు. వర్ణాశ్రమ ధర్మము ననుసరించి ఆయన నడుచుకొనును. ప్రతిదినము పరమశివుని పూజించుట అతని ఆచారము. అతడు ప్రతిదినము పెందలకడనే లేచి కాల కృత్యములు తీర్చుకొని, స్నాన సంధ్యలు నెరవేర్చుకొని పూజారితో దైవమందిరమున కేగి ఆతని శక్తి ననుసరించి భగవానుడగు శంకరుని పూజించు చుండెడివాడు. నిత్యము అష్టోత్తర పూజ, పంచామృత స్నానము, వివిధ విధములగు పుష్పములతో, సువాసన ద్రవ్యములతో, అక్షతలతో, మణులు, రత్నములతో పూజించెడివాడు. మిక్కిలి విలువ గల రత్నాభరణములు పరమ శివునకు అలంకరించెడివాడు. వివిధ విధములగు పదార్థములు పరమేశ్వరునకు నివేదించెడు వాడు. మేళతాళములతో శంకర భగవానునికి పవళింపు సేవలు చేసెడివాడు. ఈ నియమమును నందివైశ్యుడు చాలా కాలము పాటించినాడు.

శంకర భగవానుడు కేవలము గంగాజలము, మారేడు దళములతో పూజచేసిననే ప్రసన్నుడగును. ఇంద్రసేన మహారాజు హర - హర అనుటతోడనే ప్రసన్నుడయ్యె గదా ! నియమ పాలనకు ప్రసన్నుడగునో లేదో తెలియదు గాని, భక్తి యుండెనేని ప్రసన్నుడగుటలో ఆశ్చర్యము లేదు గదా !

నందివైశ్యుడు అనుదినము వివిధ విధములగు పుష్పములతో గంగాజలముతో మారేడు దళములతో శివునకు అభిషేకము, అష్టోత్తరము, సహస్రనామ పూజలుచేసి, తన గృహమునకు వచ్చుచుండెడివాడు.

ఒకనాడు ఒక కిరాతుడా పట్టణ సమీపమున గల ఆ శివ మందిరమునకు వచ్చినాడు. ఆతని బుద్ధి జడప్రాయమైనది. అడవి జంతువుల జంపి ఆహారముగా తినువాడు. ఆతనిలో దయా దాక్షిణ్యము లేమాత్రము లేవు. అది అర్ధరాత్రి సమయము. ఆకలి దప్పికలు ఆతనిని బాధించు చున్నవి. ఆ మందిర సమీపము ననే కోనేరు గలదు. దానిలో స్నానము చేసినాడు. కడుపు నిండుగా మంచినీరు త్రాగినాడు. స్వస్థత చేకూరుటచే ప్రశాంత ముగా నున్నాడు. అచ్చటనే ఉన్న శివ మందిరముపై ఆతని చూపు పడినది. శివుని దర్శింపవలెననెడి కోరిక కలిగినది. వెంటనే మందిరము లోనికి వెడలినాడు. శంకర భగవానుని దర్శించినాడు. ఆతని మనసున శంకరుని పూజించవలెనని కోరిక కలిగినది. పూర్వ జన్మ కర్మలు ఎవరికెట్లు గలవో తెలియదు గదా! ఆతనికి నచ్చిన విధంగా పరమశివుని అలంకరించి పూజించవలెనని నిర్ణయించు కొన్నాడు. ఏ ఏ వస్తువులు, సామాగ్రులు పూజకు గావలసి యుండునో ఆతనికి తెలియుటలేదు. ఏ ఏ వస్తువులతో స్వామిని ఎట్లా పూజించాలి? ఏ ఏ వస్తు సామాగ్రులు ఎపుడు ఉపయోగించ వలెనో ఆతనికి తెలియదు. భక్తులు, యాత్రికులు శివునకు అభి షేకము చేసినట్లు బిల్వ పత్రములతో శివపూజ చేసినట్లు తెలిసి కొన్నాడు.

అడవిలోనికి వెళ్ళినాడు. బిల్వ పత్రములు కోసుకొన్నాడు. ఒక జంతువును వేటాడి మాంసము నొక చేతిలోనికి తీసుకొన్నాడు. నోటి నిండా నీటిని పుక్కిలి బట్టినాడు (గండూష జలము) ఆ నోటితో తెచ్చిన నీటితో శివునకు అభిషేకము చేసినాడు. బిల్వ పత్రములను శివలింగముపై నుంచినాడు. మాంసము నివేదించి నాడు.

నందీవైశ్యుడు అలంకరించిన మణులు, మాణిక్యములను దూరంగా నెట్టి వాటి స్థానమున ఆ మాంసపు ముద్దను వుంచి వెళ్ళినాడు.

ఆ భిల్లుడు మందమతి, మాంసాహారి. భగవానునికి మాంసమును నివేదింపవచ్చునో, నివేదింపగూడదో గూడా తెలియని వాడు. మూర్ఖుడు. తెలిసిచేసిన యెడల మహారౌరవ నరకములో పడును. ఆతనికి తెలియదు కనుక తన శక్తి ననుసరించి ఆతని బుద్ధికి తోచిన విధంగా చేసినాడు. తను చేసిన, చేయుచున్న పూజకు ఆ కిరాత భక్తుడు సంతోషించినాడు.

పూజలు, స్వామికి నివేదన పూర్తి అగుట తోడనే పరమ శివునకు సాష్టాంగ నమస్కారము చేసినాడు. అనుదినము శివ మందిరమునకు వచ్చి పూజలు చేయవలెనని నిర్ణయించుకొన్నాడు.

మరునాడు నందీవైశ్యుడు పూజారిని వెంటనిడుకొని ఆ శివ మందిరమునకు వచ్చినాడు. ఆ మందిర ప్రాంగణము నిండుగా మాంసము, మారేడు, బిల్వ పత్రములున్నవి. రాత్రి ఈ శివలింగ ప్రాంగణము చుట్టు యిదేమియునుదే. నేడు ఈ విధముగా నుండుటకు కారణ మేమిటియో ఆతనికి బోధపడ లేదు. ఈ మాంసపు ముద్దలు ఎలా లోనికి వచ్చినవి ? చిందర వందరగా ఈ బిల్వ పత్రములు ఏల పడి ఉన్నవి ? దీనికి కారణమేమి ? రత్నములు మాణిక్యములు ఏల వెదజల్లబడి ఉన్నవి ? ఎవడో దుర్మార్గుడు లోపలికి వచ్చి ఈ విధముగా అపవిత్రము చేసి

యుండవచ్చునని అనుకొన్నాడు. నేనేమయినా పూజ తప్పు చేసితినా ? ఇది తప్పు జరిగినందుకు ప్రతి ఫలమా ? అని బాధ పడి ఆలోచనా నిమగ్నుడైనాడు.

ఈ విధముగా జరుగుట తన దురదృష్టమని భావించుకొని శివ మందిరమును పరిశుభ్రముగా నూడ్చి, ఆ తెచ్చిన గంగా జల ముతో పరిశుభ్రముగా కడిగినాడు. శివలింగమును కడిగి అభిషేక ము చేసిరీ శివ సహస్ర, అష్టోత్తర పూజలు చేసి, ఎప్పటివలెనే రత్నముల చేత మణుల చేత అలంకరించి, మారేడు పత్రముల, బిల్వ పత్రముల సమర్పించి నందీవైశ్యుడు గృహమున కెడలినాడు.

నందీవైశ్యుడు ఇంటికి వెళ్ళినాడు. నిశిరాత్రి సమయములో కిరాత భక్తుడు వచ్చినాడు. నోటి నిండా నీరు తెచ్చి ఆ లింగమును అభిషేకించినాడు. ఆ వైశ్య భక్తుడు సమర్పించిన బిల్వపత్రముల, మారేడు దళముల, రత్నముల, మణుల తీసిపారవైచి వాటి స్థాన ములో మాంసపు ముద్ద లుంచి తనవితీర పూజించుకొని కిరాత భక్తుడు వెడలినాడు.

ఆతడు వెడలిన తదుపరి మరుసటి దినమున నందీవైశ్యుడు, పూజారి వచ్చినారు. ఈ దుర్మార్గపు కార్యమును జూచుసరికి వారికి మిక్కిలిగ ఆగ్రహము కలిగినది. ఆతనిని ఈ రోజే పట్టుకొన వలెనని నిర్ణయించుకొని మందిరము లోని కెడలి ఒక మూలన స్తంబము చాటున దాగిరి.

అది అర్థరాత్రి సమయము. కిరాతుడు రానే వచ్చు చున్నాడు. ఆతడు వచ్చుచు నోటి నిండుగా గంగా జలమును, బిల్వ పత్రముల, మారేడు దళముల, మాంసపు ముక్కలు దీసి కొని అజానుబాహులు గల్గినట్టియు, మిక్కిలి పొడవు గలవాడు.

తలపాగాను ధరించి, అందు కోడి ఈకలును తురాయిగా పెట్టుకొని నల్లని ఆకారము గల మనీషిని వచ్చు చుండుటను వీరు చూచిరి.

ఆ వచ్చిన కిరాత భక్తుడు శివలింగమునకు ప్రదక్షిణలు చేసి, సాష్టాంగ నమస్కారములు చేసి, లింగమునకు అభిషేకము చేసి, మాంసమును నివేదన, పూజలు చేసి, నమస్కరించి వెను దిరిగి వెడల సాగినాడు.

నందీవైశ్యుడు, పూజారి, ఆ భిల్లుని చూచి భయపడి ప్రక్కకు వెడలి నక్కుచుండిరి. వాడెక్కడ నుండి వచ్చుచున్నాడో వీరికి తెలియుట లేదు. ఈ విధముగా చేసిన శివునకు అపచారము చేసిన వారల మగుదుమని, సద్గతులు కలుగవని భావించుకొని, పూజారి అజ్ఞానుసారమును ఆపాను పట్టమును శివలింగమును పెకలించుకొని వారి ఇంటికి తీసుకొని వెడలిరి. ఆ శివలింగమును ప్రతిష్ఠించి రత్నాలు మణులు, ఆభరణముల అలంకరించి పూజించు చుండిరి. ఆ పరమ శివునకు హృదయ పూజ అవసరము గాని ఆభరణ పూజలు కాదుగదా !

మరునాడు ఆ భిల్ల భక్తుడు శివ పూజలు చేసికొనుటకు ఆ మందిరమునకు వచ్చినాడు. వచ్చునపుడే నోటి నిండుగా గంగా జలమును, బిల్వపత్రములను, మారేడు దళముల పూజకును, నివేదనకు మాంసమును దెచ్చినాడు. అచ్చట ఆ శివలింగము లేదు. తన మనస్సును తాను నమ్మశక్యము అగుటలేదు. లింగము అదృశ్యమైనట్లుగా భావించి వర్ణింప వీలులేనంతగా బాధపడి నాడు. ప్రాణత్యాగం చేయుటకు సిద్ధమయినాడు.

ఎంతో ఆర్ద్రతతో పరమ శివుని స్తుతింప సాగినాడు. ఆ పరా కాష్ఠ భక్తిలోనే సమాధిస్థితి పొందినాడు. పరమశివుని దివ్య పాద

పద్మముల నుండి ఆతని మనస్సు నటునిటు కదులుట లేదు. కొంతసేపటికి అతనికి బాహ్యస్మృతి కలిగినది. సమాధి భంగ మైనది.

త్రిపురాంతకా! శంకరా! మహాదేవా! గంగాధరా! నా విన్నపమును ఆలకింపుము. నీ దివ్యము, అమోఘము నగు రూప దర్శనము నిమ్ము. అట్లు కాదందువేని నా ప్రాణములను తీసు కొనుము అని శపథము చేసినాడు.

ఆతని దృఢ దీక్షకు, భక్తికి పరమ శివుడు సంతోషించినాడు. ఆ భిల్లుడు సమాధి నుండి లేచుసరికి పూజారి, నందీవైశ్యుడు గుడి నుండి తీసుకొని వెళ్ళిన శివలింగము ఎప్పటి ప్రదేశములో, ఎప్పటి వలె వెలసి యున్నది. ఆ కిరాత భక్తునికి కలిగిన సంతోష మును వర్ణింపలేము. ఆ శివలింగమునకు ప్రదక్షిణలు చేసి తను తెచ్చిన మారేడు, బిల్వ పత్రములతో తనకు తోచిన విధముగా పూజించి మాంసమును నివేదించి, దండము వలె సాష్టాంగ నమ స్కారము చేసి లింగమున కెదురుగా మౌనముగా కూర్చుండి యున్నాడు.

కిరాతుని హృదయమున సంసార సంబంధములగు కోరి కలు గాని, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు గాని లేవు. ఆతని హృదయము నిశ్చలముగా నుండి సదా భగ వంతుని ధ్యానించసాగెను. ఆతని నియమమునకు వ్రతమునకు పరమ శివుడు మెచ్చుకొని దర్శన మిచ్చినాడు.

కావున భగవంతుడు, శ్రద్ధా విశ్వాసములు లేని డాంభిక పూజలకు లొంగడు. శ్రద్ధా విశ్వాసములే భగవంతుని దర్శిం చుటకు మార్గము అని నందీవైశ్యుడు, పూజారి తెలుసుకొనిరి.



# 4. నిష్కామ సేవా పరాయణుడు

పూర్వకాలములో అవంతికా నగరమున ధర్మాత్ముడగు రాజు కలడు. మిక్కిలి భక్తి గలవాడు. సాధుసేవా సంపన్నుడు. నిత్యాన్నదాత. న్యాయముగా, ధర్మముగ రాజ్యమును పరిపాలించు చుండెడి వాడు. తమ రాజ్యము లోని ప్రజలెల్లరను సంతోష పర చుటయే అతని నిత్య కార్యము. పశు పక్ష్యాదులనిన అతని కెంతో ప్రేమ. వాటికిని తగిన విధముగ ఆహార, విహారములు సలుపుటకు గాను తగిన ఏర్పాట్లు చేసెను. జీవహింస చేయుటను అతడు సహించడు. అంతటి భక్తుడైనను కొంత కాలమునకు చనిపోయెను. పుణ్య కర్మలు చేసినప్పటికిని యమదూతలు వానిని సగౌరవముగా నరక మార్గము గుండా తీసుకొని వెళ్ళిరి. పరోపకారి యగు ఆ రాజు ఆ నరకవాసుల బాధలు చూచుటచే హృదయము ద్రవించినది. ఆ నారకీయులు పడుచున్న బాధలు వర్ణనాతీతము. వారి కేకలు వినజాలకుండెను. ఆ నరక వాసులెల్లరు ఆ ధర్మాత్ము డగు రాజు నరక మార్గమున పోవుటను జూచి ఎక్కడి వారక్కడనే చెల్లాచెదురుగా లేచి మహారాజా! మీరు మమ్ములను వదలి వెళ్ళ వద్దు. కొంత కాలము మా వద్దనే విశ్రమింపుడు. మమ్ములను మీ చేతులతో స్పృశింపుడు. మహారాజా! మీ శరీరముపై నుండి వచ్చు గాలిని మేము పీల్చుట చేత మాకెంతో ఆనందముగా ఉన్నది. మేము అనుభవించుచున్న నరకబాధలు పోవుచున్నవి. మీ స్పర్శ ప్రభావము చేత మంద, సుగంధ, శీతల వాయువులు వచ్చు చున్నవి. మాకు గల్గుచున్న ఆనందమును వర్ణింపలేము. మామా

మనస్సులు ఆనంద డోలికలలో ఊగుచున్నవి అని నారకీయులు పలుక రాజు యమ దూతలతో ఇట్లు పల్కినాడు.

యమదూతలారా! నేనీ ప్రదేశమందు ఉండిన యెడల వీరులకు సుఖమెందులకు కల్గుచున్నది. నేను ఈ నారకీయులకు సుఖము కల్గుటకు గాను ఏమి చేసితిని అని రాజు పల్కినాడు.

యమదూతలు ఇట్లు పల్కసాగిరి! మహారాజా నీవు వయో వృద్ధులకు, భక్తులకు, సాధు సంతలకు, అతిధులకు అన్న, వస్త్ర, గృహ, వాహనాది సత్కారములు చేసితిరి. భగవన్నామమును నిర్విరామముగా కీర్తించితిరి. మీరు చేసిన సత్కర్మల వలన మీ శరీరముపై నుండి వచ్చు గాలి నరకవాసులకు ఆనందముగా ఉన్నది. సద్భక్తుని దర్శన ప్రభావము వలన నరకయాతనలు సహజముగనే దప్పును.

మహారాజా! నీ యొక్క దర్శన ప్రభావము వలన ఈ పాపులకే గాక, యమ ధర్మరాజు యొక్క అస్త్రశస్త్రములు, ఇనుప ముక్కు గల పక్షులు, సల సలకాగు నూనె, కాంతి హీనములై వాటి వాటి పనులు విరమించుకున్నవి. యమలోక అగ్ని కాంతిహీనమై, శీతలము, మృదువునై యున్నది. అందువలన ఈ ఘోర పాపులు సుఖమును పొందుచున్నారు అని యమదూతలు పల్కిరి.

రాజు యమదూతలతో ఇట్లు పల్కెను. ఓ! దూతలారా నాకును వీరిని చూచిన సంతోషము కల్గుచున్నది. నాకు తోటి ప్రాణులను రక్షించుటలోనే ఆనందము కలదు. నా సుఖము సుఖము కాదు, ఈ నారకీయులకు నేనిక్కడ ఉండిన యెడల

ఆనందము, సుఖము, సంతోషము కలిగెననేని నల్లరాతివలె కదలక ఇచ్చటనే యుండెదనని రాజు పల్కినాడు.

యమదూతలు ఇట్లు పల్కసాగిరి! ఓ మహారాజా! భక్త శ్రేష్ఠా! ఇది పాపులు ఉండు ప్రదేశము. అట్టి ఈ నరకలోకములో మీరుండరాదు. పుణ్యలోకమున కెడలి మీమీ పుణ్య ఫలితముల ననుభవించవలెను. ఈ నారకీయులు పాప ఫలమును అనుభవించెదరు. కనుక మీరు స్వర్గలోకమునకు పోవలెను.

రాజు యమదూతలతో ఇట్లు పలుకసాగెను. ఓ యమదూతలారా! వీరిట్లు ఎంతకాలము ఈ బాధలు అనుభవించవలెను. వీరికి ఈ బాధలు ఎట్లు పోవునో అంతవరకు నేనిచ్చటనే యుందును. నేనిక్కడ యుండిన యెడల వీరికి సుఖము కల్గుచున్నది కదా! నేనిక్కడ నుండి ఒక్క అడుగు ముందుకు వేయుటకు నా మనస్సు అంగీకరించుటలేదు. కష్టములో నున్న యెడల శత్రువునైనను ఆదరించవలెను. అట్లు చెయ్యని వాని జీవితము అడవి కాచిన వెన్నెలవలె వ్యర్థమే గదా! బాధితుల దుఃఖమును పోగొట్టలేని వాని బ్రతుకు ఫలింపని వృక్షము వంటిది అట్లు వారు ఇహ లోకమున గాని, పరలోకమున గాని సుఖింపలేరు ఆర్తులను, దుఃఖితులను, వృద్ధులను, ప్రేమింపని మానవుడు దానవునితో సమానము. ఈ నరకవాసులు నరకాగ్ని తాపము నుండి, ఆకలి దప్పుల నుండి, దుఃఖముల నుండి సుఖముగ, సంతోషముగ ఉందురేని నా వ్యక్తిగత సర్వలోక సుఖముల కన్నను ఇదియే ఆనందము. నేనొక్కడినే బాధపడిన వీరెల్లరు సుఖ సంతోషములతో ఉండెదరు నాకా ఆనందము వుండును.

నా కంటె పూర్వీకులగు జీమూతవాహనుడు నాగకన్య ప్రాణ రక్షణార్థమై తన ప్రాణములను బలిచేసె గదా! శిబి చక్రవర్తి పావురము ప్రాణరక్షణ నిమిత్తమై తన శరీరమునే కోసి డేగకు ఆహారముగా ఇచ్చెను గదా! దధీచి మహాముని రాక్షస సంహార ణార్థమై తన వెన్నెముకనే తీసి ఇంద్రున కిచ్చె గదా! కనుక నేను వారినే ఆదర్శముగ బెట్టుకొని వీరి సుఖము కొరకు నాకు కలుగు కష్టమును సహించుచు నే నిక్కడనే యుందును. నాకిదే పరమానందముతో గూడిన విషయము అన యమదూతలు ఇట్లు పలకసాగిరి.

ఓ మహారాజా! భక్తశ్రేష్ఠా నీవు ఇచ్చట నుండుటకు వీలు లేదు. నిన్ను స్వర్గ లోకమునకు తీసికొని వెడలుటకు గాను ఇంద్రుడు, యమధర్మరాజు, మిగిలిన దిక్పతులు వచ్చిరి. మమ్ముల నను్గ్రహించి వారి వెంట వెడల వలసినదిగా వేడుకొను చున్నాము. మహారాజా! నీవు నియమముగా జపమునాచరించుట వలన శ్రీమన్నారాయణమూర్తి దేవ విమానము పంపెను. దాని నెక్కి స్వర్గలోకమును చేరుము. అని ఇంద్రాదులు పలుక మహారాజు ఇట్లు పల్కినాడు.

ఓ యమధర్మరాజా! ఈ కోటాను కోట్ల జీవులు నరక లోక మున బాధపడుచున్న నేను సుఖముగ స్వర్గ లోకములో ఉండ గలనా! నేనిక్కడ ఉండిన వీరెల్లరకు సుఖము, సంతోషము, శాంతి కలుగు చున్నది గదా! వీరి బాధలు పోవుటయే నాధ్యే యము. కనుక ఈ లోకము నొదలి నేనెచ్చటికిని పోనని రాజు పల్కెను.

అప్పుడు యమధర్మరాజు "మహారాజా! భక్తవర్యా! జీవులువారి వారి కర్మానుసారము పాప పుణ్యములు అనుభవించు చుందురు. నీవు చేసిన పుణ్య ఫలితముల ననుభవించుట కొరకు స్వర్గ లోకమునకు ఈ విమానమునెక్కి చేరుకో వలసినది. నీవిక్కడుండి నరకవాసులకు పుణ్యమును కల్గించితివి. ఆ కారణము వలన నీకు లక్షల రెట్లు పుణ్యము వచ్చినది. నీ పుణ్య ఫలితములను బట్టి వివిధ విధములగు భోగముల అనుభవించుట కొరకు స్వర్గ లోకమునకు వెడల వలసినదే అని యమధర్మరాజు పలుకగా

యమధర్మరాజా! వీరికి బాధలు తొలగుటకు గాను, సుఖము, సంతోషము కల్గుటకుగానునా పుణ్యమును వారల కొరకు ధార పోయుదును. నేను వీరితోపాటు ఉండుటకే నిశ్చయించుకొంటిని. అని రాజు పల్కుచుండగానే ఆ నరకవాసులెల్లను ఆ పుణ్యపురుషుని దర్శన ప్రభావమువలన వారి వారి పాపములు నశించి దేవ విమానముపై స్వర్గ లోకమునకు వెడలు చుండిరి. భక్తుడగు మహారాజు సంపాదించిన పుణ్యమును నిష్కామముగ పాపులకు ధారపోయుటచే వారెల్లరు తరించిరి. ఇంద్రుడు స్వయముగ దేవ విమానమును తెచ్చి దానిలో మహారాజును స్వాగతించి ఇంద్ర లోకమునకు తీసుకొని వెడలుచుండ ముక్కోటి దేవతలు పరోపకారి యగు భక్తరాజుపై పుష్పవర్షమును కురిపించిరి. నరకవాసులెల్లరు ఉద్ధరింపబడిరి.

భక్తులారా! సాధు మహాత్ముల, భక్తుల దర్శనము అమోఘమైనది. "సాధునాం దర్శనం పుణ్యం" అని శాస్త్రము చెప్పు

చున్నది గదా ! కనుక సాధు, భక్తులకు సేవలు చేసి అనేక మంది తరించినట్లు రామాయణాది గ్రంథములు పెద్దలు చెప్పు చుండుట అందరు ఎరిగినదే. కనుక పెద్దలకు సేవలు చేసిన తరించుటలో ఇసుమంతయు సందేహము లేదని ఈ కథ చెప్పు చున్నది. గదా !

*"కామయే దుఃఖత ప్తానాం*
*ప్రాణినా మార్త నాశనమ్"*

అని ప్రాచీన కావ్యములో చెప్పిన మాట దీనిని బట్టి సత్య మైనది గదా !



# 5. సాధు మహారాజుల మహాత్మ్యము-సందేశము

శ్లో॥ సాధునాం దర్శనం పుణ్యం । స్పర్శనం పాపనాశనం
సంభాషణం కోటి తీర్థం । సేవనం ముక్తి దాయకం.

కం॥ సాధుల హృదయంబు నాయది
సాధుల హృదయంబు నేను జగముల నెల్లన్
సాధుల నేను ఎరుంగుదు
సాధు లెరుగుదురు నాదు చరిత్రము విప్రా,

అని పెద్దలు పలికినట్లు గొర్రెల వంటి మానవులను తరింప జేయుటకు గాను సాధు రూపమున గాని, గురు రూపమున గాని, భక్తుని రూపమున గాని ఆ దివి నుండి ఈ భువికి భగవంతుడే స్వయముగా దిగి వచ్చి దుఃఖములలో, బాధలలో నుండు మానవులను తరింపజేయునని కలియుగ అవతారమూర్తి అగు శ్రీ శ్రీ రామకృష్ణ పరమహంస చెప్పెను గదా !

ఈ దుఃఖ భూయిష్టమైన, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు, ఈర్ష్య, జుగుప్స మొదలగుగా గల అశాంతితో కూడిన బంధు, మిత్ర, పుత్ర కళత్రాదు లనెడి మొసళ్ళ రూపమున గల ఈ ఘోర సంసార సముద్రము నుండి తరించవలెనన్న మానవులకు సాధు స్వరూప సర్వేశ్వరుని యొక్క దివ్యానుగ్రహము అత్యంత అవసరమని మహాత్ములు చెప్పు

చున్నారు. అట్లు కాదేని మరల మరల పుట్టుచు, గిట్టుచు ఉండ వలెను. దివ్య పురుషులు లభించిన యెడల వారికి చతుర్విధ శుశ్రూషలు సలిపి, వారి ఆజ్ఞలను పాటించు చుండుటయే భక్తుని జీవన విధానము. అట్లు కాదేని భక్తి ఏర్పడుటకు అవకాశమే లేదు. అట్టి సద్భక్తుల, సాధు మహాత్ముల గుర్తించుట కష్టముతో కూడిన పని. వారును మనవలెనె సంభాషించుచు, ప్రవర్తించుచు, సంసార జీవన యాత్రను సలుపుచుందురు.

మణి లేని సర్పము, ముత్యము లేని ముత్యపు చిప్ప, ఫలించని వృక్షము, వర్షము లేని మేఘము, పతి లేని స్త్రీ, దీపము లేని ఇల్లు, చంద్రుడు లేని రాత్రి, వివస్త్రయగు స్త్రీ, కమల హీన మగు సరోవరము, పాలివ్వని గోవు, భువిపై రాణింపనట్లు సదా చారము, సత్కర్మ, జ్ఞానము, భక్తి, గురుసేవ లేని యెడల మానవుడు, మాధవుని వైపు ప్రయాణించ లేడని వేదములు, ఋషులు, భక్తులు, కవులు, రామాయణాది మహా గ్రంథములు చెప్పుచున్నవి గదా ! కనుక ఈ నీటి బుడగ వంటి దేహముపై మమకారాదులు పెంచుకొనిన కొలది విషయ శక్తి పెరుగుట జగమెరిగిన విషయమే గదా ! సాధు పురుషుడన ఎట్టి వాడో మేటి రామ భక్తుడు, రామ సాక్షాత్కారము బొందిన చిన్మయ స్వరూపుడు, కలియుగ వాల్మీకి యగు శ్రీ శ్రీ గోస్వామి తులసీదాసు గారు ఇట్లు పలికిరి.

అత్యంత శాంత స్వభావము కలిగిన వాడును, మనస్సును, ఇంద్రియములను స్వాధీన పరచుకొన్న వాడును, ధ్యానము, సంకీర్తనాదులు, సత్కథా కాలక్షేపములు, సత్స సంగము గడుపుచు ఉన్న వారును, కాని పలుకులు పలుకక చిలుక పలుకుల

వలె పలుకు వారును, వీడు నావాడు, వాడు పరాయివాడని చూడక సర్వులను సమబుద్ధితో చూచువాడును, తాను తరించి ఇతరులను తరింపజేయు వాడును, రాగద్వేషములు లేని వాడును, సత్ శీలము గల వాడును, ద్వంద్వా తీతుడును సర్వమును భగవన్మయముగ జూచు వాడు నిజమగు జ్ఞాని. అతడే నిజమగు సాధు స్వరూప భగవంతుడు. అట్టివాడే దివ్య పురుషుడు. ఈ ఘోర సంసార సముద్రమున కొట్టుమిట్టాడు చుండు మానవుల తరింప జేయుటకు సమర్థుడగు గురువు.

మోహాంధకారమును తొలగించుటకుగాను, నాల్గు వైపుల సంచరించు చుండు సాధువులే భగవత్ స్వరూపులు. అట్టి మహాత్ములు అడుగిడిన ప్రదేశమే పుణ్యభూమి. ఆ దివ్య పురుషులే లోక కళ్యాణము కొరకు సద్ భక్తి మార్గములు ఉపదేశించుచు ఈ మూర్ఖ మానవులను మాధవుని వైపు త్రిప్పగలరు. ఈ సంసార రూప మాయా జంఝాటము నుండి విముక్తి నొందుడని పలుక గల సమర్థుడు సాధువే! జీవులను ఉద్ధరించుటకు సాధువు సేతువు వంటి వాడు. పరశువేది ఇనుమును బంగారము చేయు నట్లు, అగ్ని మాలిన్యమును పోగొట్టునట్లు, నీరు అగ్ని నార్పునట్లు సూర్యుడు చీకట్లను పోగొట్టునట్లు, ఆ దివ్య పురుషులే మూఢుల నాశ్రయించి యున్న (కామ, క్రోధ, లోభ, మద, మోహములు) అజ్ఞానాంధకారమును నాశనము చేయుటకు సూర్యుని వంటి వారై దుర్మార్గులను సన్మార్గము వైపు త్రిప్పి తరింప జేయు గలరు.

ఆ దివ్య మనస్కులైన సాధువుల వాక్కుల నుండి సర్వ కాలములలో సద్ వచనామృత రసము స్రవించు చుండును. ఆ

దివ్య పురుషుల ప్రేమామృత వలుకులు వినుట వలన, కఠినా త్ములు సంయితము ప్రేమాంబుధిలో మునిగి ఆత్మానుభవ మును పొంది, వారిలో భయమును, భ్రమను, అహంకారమును పోగొట్టు కొందురు. ఆ సాధు మహాత్ముని వచానామృత ప్రభా వము వలన అజ్ఞాన రూపమనెడు గ్రంథిని మూఢ మానవులు నిర్మూలించు కొందురు. అ దివ్య పురుషుల పలుకులు వినెడి వారును, ఆచరించు వారును, పాప తాపము లనెడి మోహము నుండి బయట పడెదరు. వారి వచనామృత ధారలు మోహాంధ కార మనెడు చీకట్లను పారద్రోలుటకు సూర్య కిరణముల వలె పని జేయును. సాధు పురుషులు ఎవరిని నిందించరు. అపకార మును చేయరు. గంగాదేవి పాపముల, చంద్రుడు తాపమును, కల్పతరువు దరిద్రమును, (గంగా పాపం శశి తాపం, దైన్యం కల్ప తరువు, పాపం, తాపంచ, దైన్యంచ, హంతి సజ్జన దర్శనః) దైన్య తను సజ్జనులు పోగొట్టు నట్లు, మహాత్ములు మానవుల త్రితాప ముల పోగొట్టి మాధవుని వైపు త్రిప్పగలరు. వారికి ఎవరి మీదను రాగ ద్వేషములు ఉండవు. ఇంద్రియ నిగ్రహము కల్గి ఉందురు. వస్తు వాహనములతో పని లేదు. స్త్రీని మాతృదేవతగా చూచెదరు. సకల చరాచర జీవులు భగవత్ స్వరూపమని భావించెదరు. అహంకార రహితులై, సుఖ దుఃఖ రహితులై, శత్రు, మిత్ర భావ ము లేక, తిరుగాడు చుండు వారే నిజమగు సాధువులు.

నెమలి అందమగు పక్షి. దాని కూత వినుటకు శ్రావ్య ముగా నుండును. కాని అది విష సర్పములను తినును. అదే విధముగా పై పైన తీపి పలుకులు పలుకుచు, సజ్జనుల వలె నటిం చుచు అవసరమగు సమయములలో నీచ ప్రవృత్తితో ప్రవర్తించుచు

సర్పములను తిను నెమలి వంటి సాధువులీ ప్రపంచములో లేక పోలేదని శ్రీ శ్రీ గోస్వామి తులసీదాసుగారు పలికిరి. జ్ఞాన రూప సూర్యుడు ఎవరి హృదయమున ఉదయించునో, అట్టి వాడు అజ్ఞానాంధకారము నుండి విడి వడి, నీది, నాది అని భావించక జీవన యాత్ర సాగించుచు, సర్వత్ర భగవంతుని దర్శించు చుండు వాడే నిజమగు సాధు పురుషుడని చెప్పిరి.

ఒకానొక సమయమున ఒక భక్తుడు ఒక సంపన్న గృహస్థుని ఇంట అతిధ్యము స్వీకరించుటకు వెళ్ళెను. భక్తి, శ్రద్ధలతో ఆ గృహస్థుడు సేవలు చేయ, ఆ సాధువునకు మిక్కిలి సంతోషము కల్గెను. ఆ మహాత్ముడు సిద్ధులకు నిలయుడు. ఆ ఇంటి నుండి ఆ సాధువు వెడలు నప్పుడు గృహ యజమానిని ఇట్లడిగెను. ఓ భక్తా ! సంపన్న గృహస్థా ! నీ సేవలకు నే సంతోషించితిని. వర మడుగుము ఇచ్చెదను. నీ కోర్కె నెరవేర్చుటకు నేను సంశయించను. అని పలుక, ఆ గృహస్థుడు రెండు చేతులతో నమస్కరించుచు వినమ్రుడై ప్రభో ! మీ యొక్క దివ్యానుగ్రహము చేత నేను సర్వ సుఖములను, సర్వ భోగములను అనుభవించుచున్నాను. నా మనస్సులో ఏమియూ కోర్కె లేదని పలుక ఆ సాధువు సంతోషించి నీకే కోర్కె లేనప్పటికి నీకేదైనా కష్టము వచ్చినపుడు నన్ను స్మరించుకొనిన కష్టములు క్షణములో తొలగునని ఆశీర్వదించి అచ్చట నుండి ఆ సాధువు వెడలినాడు.

కొంత కాలమునకు ఆ సాధువు తనకు అహారమిడిన సంపన్న గృస్థుని దర్శించుటకు వచ్చినాడు. అచ్చటి వారు ఆ సంపన్న గృహస్థ భక్తుడు మరణించెనని చెప్పిరి. ఆ సాధుమహా

తమ్ముడు మిక్కిలి బాధపడినాడు. అప్పుడా సాధువు ధ్యాన నిమగ్నుడై కూర్చుండి ఆ సంపన్న గృహస్థ భక్తుని యొక్క జీవాత్మ ఏ జీవిగా పుట్టినదో తెలిసికొనినాడు. అతడు గాడిదయై ఒక చాకలి వాని ఇంట పుట్టి తన పరివారముతో తిరుగుట చూచి, ఆ గాడిద వద్ద కెడలి దాని మెడను పట్టుకొని ఇట్లు పలికినాడు.

ఓ సంపన్న ! గృహస్తా ! భక్తా ! నీవు పూర్వ జన్మమున ఎవరవో గుర్తు తెచ్చుకో ? ఆనాడు నీవు సిరి సంపదలతో తుల తూగు ధర్మ పరాయణుడవు, అన్న దాతవు. అట్టి నీవు మరణించి గాడిదగా పుట్టితివి. నిన్ను నేనపుడు వరమడుగ మంటిని. అడుగక పోతివి గదా ! ఎక్కడ మానవ జన్మ, ఎక్కడ గాడిద జన్మ. నా దర్శనము అమోఘమైనది గనుక ఇప్పుడైనను మించి పోయినది లేదు. వరమడుగుము. నీ కోర్కె నెరవేర్తును అని పలుక గాడిద ఇట్లు పలుక సాగెను. ఓ స్వామీ ! మీ అనుగ్రహము ఉండిన చాలును. నాకు ఏ కోర్కెయు లేదు. నాకు ఈ గాడిద జన్మ మిక్కిలి సంతోషముగ ఉన్నది. నా గాడిదల పరివారముతో ఆడుచూ, పాడుచూ సంతోషముగ కాలము గడుపు చున్నాను. నాకు ఈ జన్మే మిక్కిలి సంతోషముగా ఉన్నది. నన్ను అను గ్రహించి దయ చూపుము. నాకదే పదివేలు అని ఆ గాడిద పలికిన మాటలకు ఆ సాధువు ఆశ్చర్యపడి అచ్చటి నుండి వెడలి నాడు.

మరల కొంత కాలమునకు ఆ సాధువు ఆ గాడిదను జూచు టకు వచ్చెను. అదియును చనిపోయినది. ఆ గాడిద ఇప్పుడు ఏ జన్మ ఎత్తినదో ధ్యాన నిమగ్నుడై చూడ ఒక వైశ్యుని ఇంట

చీమనైయై బెల్లము, పంచదారలపై బ్రాలుచు రుచులు జూచుచు తన పరివారమును వెంటనిడుకొని తిరుగుటను జూచి దాని వద్దకు వెడలి, నీవు పూర్వ జన్మలో గాడిదగా పుట్టితివి. అంతకు పూర్వము నీవు సంపన్న గృహస్థగా జన్మించితివి. నాకు సేవలు సల్పి, ఆహారమును పెట్టితివి. నీ సేవలకు సంతసించి వరమడుగ మంటిని. వరమడుగక పోతివి. నీ అనుగ్రహము చాలు నంటివి. నాకు మిత్రుడవై యుండి గూడ ఎంత పతనావస్థ చెందితివో ఆలో చించుకో. ఇప్పటికైనను మించిపోయినది లేదు. వర మడుగుము. సంశయింప వలదు. అని పలుక ఓ మహాత్మా ! నేను నా పరి వారముతో సుఖముగా, సంతోషముగా ఉంటిని. నాకు ఏ వరము తోను పని లేదు. నా వంటి దీనులపై మీ అనుగ్రహ ముండిన చాలును అని పలుక ఆ సాధువా చీమను పట్టుకొని కాలు క్రింద వేసి త్రొక్కి చంపినాడు. ఇప్పుడీ చీమ ఆత్మ ఎచ్చటికి పోయి నదో ధ్యాన నిమగ్నుడై చూడ దాని ఆత్మ సాకేత లోకమునకు వెడలినది. కావున సోదర భక్తులారా ! సాధు మహాత్ముని యొక్క అనుగ్రహము ఎట్టిదో చూడుడు. ఆ మహానుభావుని యొక్క దివ్యాను గ్రహము చేత చీమకు సద్గతి కలిగెను గదా ! కనుక సాధువులను దర్శించుచు వారిని ఆదరించుచు, ప్రేమించుచు ఉండిన మానవులను, మాధవుని వైపునకు త్రిప్పి తరించునట్లు చేయుటలో ఇసుమంతయు వెనుకాడరనియే రామ భక్తుడగు శ్రీ శ్రీ గోస్వామి తులసీదాసుగారు చెప్పెనని మేటి రామ భక్తుడగు శ్రీ రామశరణ్‌జీ గురు మహారాజ్ సెలవిచ్చిరి.

కావున ఓ మనసా ! రక్తము, మాంసము, అస్థులతో కూడిన ఈ శరీరముపై వ్యామోహము నొదలి, సాధు, సజ్జన సేవ చేసి, భగవత్ కృపను పొందుటకు ప్రయత్నించుము. మరల మరల రాదు ఈ నర జన్మ. కలువ పువ్వు చంద్రుని, కమలము సూర్యుని, చాతకము స్వాతి మేఘముల చూచి సంతోషించునట్లు, మనమును భగవంతుని ఆశ్రయించిన సుఖము, శాంతి, ఆనంద మును పొందుటలో ఇసుమంతయు సందేహము లేదని మహాత్ములు చెప్పు చున్నారు.



# 6. దయా సముద్రుడు-హనుమంతుడు

*యత్ర యత్ర రఘునాథ కీర్తనమ్*
*తత్ర తత్ర కృత మస్త కాంజలిమ్*
*బాష్ప వారి పరిపూర్ణ లోచనమ్*
*మారుతిం నమత రాక్షసాంతకమ్,*

హనుమంతుడు మిక్కిలి దయాసముద్రుడు. హౌరా రైల్వే స్టేషన్ మాష్టర్‌కు హనుమాన్ చాలీసా నియమ పూర్వకముగా మండలము రోజులు పారాయణ చేయవలెనని సంకల్పము కలిగి, చేయుట మొదలు పెట్టినాడు. ఒక మహా భక్తునకు ఆతిథ్యమిడి వారి సమక్షము తోనే ఆవు నేతితో దీపారాధన చేసి పారాయణ చేయ సాగినాడు. మొదటి రోజు పారాయణ జరిపి హారతి నిచ్చుచున్న సమయమున తన ఎదురుగ నున్న రైలు ఇంజనుపై ఒక పెద్ద వానరము ఉండుట చూచినాడు. అతడు పారాయణ పూర్తి చేసి వెడలు చుండ ఆ వానరము వెళ్ళి పోయినది. మరుసటి రోజున పారాయణ సమయమున అదే వానరము రైలు ఇంజను దిగి స్టీరింగ్ వద్దకు వచ్చి కూర్చున్నది. అదియును చూచినాడు. ఆ రోజు పారాయణ పూర్తి అగు వరకు ఉన్నది. హారతి పూర్తి అగుట తోడనే వెడలి పోయినది. ఈ విధముగ ప్రతి దినము ఆ వానరము వచ్చుచు, పోవుచు ఉండుటను గమనించినాడు. ఇట్లు పారాయణ చేయు దినములు దగ్గర పడుచుండ ఒకనాడా వానరము వచ్చి, ఆ రైల్వే స్టేషన్ మాస్టర్ గారి ఒడిలో కూర్చున్నది. అది అతనిని ఏమియును అనలేదు. అతను ఆ వానరమును ఏమి

అనక హనుమంతుడే ఈ రూపమున వచ్చినాడని భావించి, అరటి పండు నిచ్చి మూర్తి మంత విగ్రహముతో పాటు, ఆ వానరేశ్వరునకు హారతి నివ్వ అది అచ్చటి నుండి వెడలి పోయినది. ప్రతి దినము వచ్చుట చేత స్టేషన్ మాస్టర్‌కు ఆ వానరమునకు అవినాభావ సంబంధము ఏర్పడినది.

ఒక రోజున చాలీసా పారాయణ జరుగుచుండ ఆ వానరము వచ్చి అతని తలపై నెక్కి భుజముల మీదుగా కాళ్ళు వ్రేలాడ వేసి రెండు చేతులతో అతని తలపై అదుముచు జుట్టును పీకు చుం డెను. ఈ వానర చేష్టలకు అతనేమియును చలించ లేదు. యథా విధిగా పారాయణ చేసి హారతి నిచ్చు వరకు అది అతని భుజము పైననే ఉన్నది. హారతి పూర్తి అయిన పిదప అది వెడలి పోయినది.

ఈ విధముగా పారాయణ జరుగుచునే యున్నది. పూర్ణా హుతి దినము నాడు హారతి ఇచ్చు సమయమునకు వచ్చి అచ్చ టకు చేరిన భక్తుల సమక్షములో కూర్చొని చాలీసా పారాయణ అయ్యేంత వరకు ఉండి హారతిని తీసుకొని అరటిపండ్లు, లడ్లు మొదలగుగా గల ప్రసాదముల నారగించి వెడలి పోయినది. మిగిలిన ప్రసాదములను అక్కడ మిగిలిన భక్తులకు పంచిరి. అతని కష్టములు తొలగినవి. కోర్కెలు నెరవేరినవి.

మరుసటి దినము నుండి ఆ వానరము కనిపించలేదు. ఇట్టి దివ్యమగు లీలలు సీతాదేవికి ప్రియ పుత్రుడు, రాక్షస వంశ రూపమనెడి తృణముల దహించి వేయుటకు దావానల రూప భగవానె శ్రీరామ చంద్రునకు ప్రియ భక్తుడు, సేవకుడు, చిరంజీవి యైన హనుమంతుడు ఘాభోటి సాధువుల, భక్తుల సంకల్పముల్ను

నెరవేర్చి కాపాడుటలో సందేహము లేదని సీతారామదాస్, ఓంకార్ నాథ్ మహారాజ్ గారు ఈ జరిగిన వృత్తాంతమును చెప్పిరి.

కావున భక్తులారా! బాలులారా నిత్యము మీరున్ను ఈ హనుమాన్ చాలీసాను పారాయణ చేసి భక్త రక్షకుడగు హనుమంతుని ఏల దర్శింపరాదు ?

'జై మహావీర బజరంగ్'



# 7. తల్లి - దండ్రుల ప్రదక్షిణా ఫలితము

బాలులారా ! ఒకానొక కల్పములో కార్తికేయుడు, గణపతి వివాహ సమయములో నాకు ముందు పెండ్లి అని, నాకు ముందు పెండ్లి అని వివాద పడుచుండగా అందులకు పార్వతీ పరమేశ్వరులు నాయనలారా ! మీలో మీరు కీచులాడుకో వద్దు. మీలో భూ ప్రదక్షిణ ఎవరు ముందుగా చేసి వచ్చెదరో అట్టి వారికి మొదటిగా కళ్యాణము జరుగునని చెప్పిరి. అందులకు సంతోషించి వినాయకుడు తన వాహనమగు మూషికము నెక్కియు, కార్తికేయుడు తన వాహనమగు నెమలి నెక్కియు ప్రయాణము చేయు చుండిరి. నెమలికి అధిక వేగము గనుక శక్తి గలదు. కాని మూషిక వాహనుడగు వినాయనకునకు ఎంతసేపు ప్రయాణము సాగించినను బహుకొద్ది దూరము మాత్రమే ప్రయాణము చేయ గలిగినాడు. కార్తికేయుని మించి పోవుటకు ఎలుకను ముట్టిపై కొట్ట సాగినాడు. ఆ దెబ్బకు తాళలేక అది ముడ్డిని ఎత్తగా ముందుకు పడినాడు. దానికి కళ్ళెము, లగాములు బిగించి మరల మూషికముపై ఎక్కి కూర్చున్నాడు. కాని ఇప్పుడును బొట్టలాంటి పొట్ట ఉన్న, పొడ వాటి తొండము గలిగిన గణపతి ఎలుక నెక్కి సవారి చేయుచు, కార్తికేయుని దాటి తాను ముందు బోవలెనని ధృఢ నిశ్చయముతో ఈ రెండవ పర్యాయము ముడ్డిపై కొట్టినాడు. అది ఆ దెబ్బకు తట్టుకొన జాలక ముడ్డి నెత్తి ఎగిరినది. గణపతి ముందుకు పడినాడు. ఇట్లు గణపతి ముందునకు పడుచు, లేచుచు, దుమ్ము దులుపు కొనుచు, అవస్థ పడుచు కార్తికేయునితో పాటు ప్రయాణము చేయ జాలకుండెను. నా కంటే ముందుగా కార్తికేయుడు

తన వాహనమగు నెమలి నెక్కి అతి వేగముగా పోవు చున్నాడు. నా సోదరునకే ముందు వివాహ మగును. నా తల్లిదండ్రులు నా విషయమున కఠిన పరీక్షలు చేయుచున్నారని ఆవేదన పడుచు నిదానముగా మూషిక వాహనారూఢుడై ప్రయాణము చేయు చున్నాడు.

మార్గ మధ్యములో బ్రహ్మ మానస పుత్రుడు, భక్త శ్రేయో భిలాషి నిరంతరము భగవన్నామ కీర్తన చేయుచు ఆనంద డోలక లలో దేలుచు, మునుగుచు నుండు వాడగు నారద మహర్షి వినాయ కుని ముందు నిలుచుండినాడు. గణపతికి అతనిని చూచుట తోడనే ఊహింపరాని సంతోషము కలిగినది. తన బాధను పోగొట్ట గల సమర్థుడు నారదుడేనని భావించి తన, కార్తికేయుని వివాహ నిర్ణయ విషయములో తల్లిదండ్రులు పెట్టిన నియమమును గూర్చి నారదునకు చెప్పినాడు. అది వినిన నారదునకు మిక్కిలి సంతో షము కలిగినది.

ఓ ! గణపతీ ! మీ తల్లితండ్రులు పెట్టిన నియమము చాలా గొప్పది. అని పలుక వినాయకుడు మరల ప్రయాణము సాగించినాడు. ఎంత దూరము పోయినను నారదుని అంగకు దాట లేకుండిరి.

అప్పుడు నారదుడు ఇట్లు పలికినాడు. ఓ గణపతీ ! నీకు సర్వ శాస్త్రములు తెలియును. సృష్టి, స్థితి, లయకారులగు పార్వతీ పరమేశ్వరుల పుత్రుడవు. అట్టి నీకు శాస్త్ర విషయము జ్ఞప్తికి వచ్చుట లేదా ? ఒక్క పర్యాయము నా మాట వినుము అని పలుక, గణపతి నేను భూ ప్రదక్షిణ చేయవలె నన్నాప

కుము. అని పలుకక, గణపతీ ! నీవు నీ సోదరుడగు కార్తికేయుని దాటి ముందుగా కైలాసమునకు వెడలుట అసంభవము. అత డిప్పుడు అతల, కుతల, రసాతల, భువర్లోకములు దాటినాడు. నీవు భూలోక మందే ఉంటివి. కనుక నీవు అతనిని ఏ విధముగా అధిగమించి ముందుకు పొగలవు ? దానికి ఒక్కటే మార్గము గలదు. నీవు చెప్పు మనెదవేని చెప్పెదను. నీవు చేయగలవా ! సిగ్గును, లజ్జను, అభిమానమును వదలగలవా ? దానికి సిద్ధపడు దువేని నీకు చెప్పుటలో వెనుకాడను. నీకు నీ సోదరుని కన్ననూ ముందుగా వివాహ మగుటలో సందేహము లేదు. అని నారదుడు పలికినాడు.

వినాయకుడు ఆ నారద మహర్షి పలుకులు విని సంతసించి నారదుని తనకు వివాహ మెట్లగునో అది చెప్పమని వేడుకొనినాడు. వినాయకుని మాటలకు నారదుడు సంతసించి నాయనా ! శాస్త్ర మిట్లు ఉన్నది గదా !

*చౌ॥ మాతా హోతీ జఢీభూమీసె,*
*పితా స్వర్గసే ఉచ్చమాన్ ॥*
*యహీ సోచకర్ శ్రీ గణపతీనే,*
*కీప్రదక్షిణా తజి అభిమాన్,*
*వికదంత గజ వదన చతుర్భుజ*
*గణ నాయక విశేష సుజాన్*
*అది పూజ్యా బన్ గయే తభీసే*
*మంగళమయ సుఖద భగవాన్*

శ్లో॥ పితా, ధర్మః పితాస్వర్గః
పితాహి పరమం తపః
పితరి, ప్రీతిమాపన్నె ప్రీయంతే
సర్వే దేవతాః
సర్వే తీర్థమయీ ! మాతా !
సర్వే దేవ మయః పితా !

అని శాస్త్ర ప్రమాణము గదా గణపతి నీ వేల అట్లు ఆచరించవు ? అని నారదుడు పలుక, బుద్ధిమంతులలో, గుణవంతులలో శ్రేష్ఠుడగు గణపతి, నారద మహర్షి యొక్క మాటలను విన్నవాడై వెనుదిరిగి ప్రత్యక్ష దేవతలగు తల్లితండ్రుల వద్దకు వెడలి, వారికి నమస్కరించి, వారుభయులను ఒక వేదికపై కూర్చుండబెట్టి వారికి మూడు ప్రదక్షిణలు జేసి సాష్టాంగ నమస్కారము చేసినాడు. లేచి నిలుచుండి చేతులతో నమస్కరించుచు తల్లి దండ్రులారా ! నేను పై శాస్త్రానుసారము ననుసరించి ముమ్మారు భూ ప్రదక్షిణలు సలిపితిని. అని పలుక వారికెంతో సంతోషము కల్గినది. అతని బుద్ధి బలమునకు మెచ్చి ప్రజాపతి పుత్రికలైన సిద్ధి, బుద్ధి అను సుందర కన్యలను ఇచ్చి పెండ్లి చేసినారు. కార్తికేయుడు భూ ప్రదక్షిణ చేసి వచ్చుసరికి గణపతికి వివాహమై యుండుట చూచినాడు. సుబ్రహ్మణ్యుడు కోపొద్రిక్తుడైనాడు. ఓర్పు సన్నగిల్లినది.

నాయనా ! నా సోదరుడగు గణపతి భూ ప్రదక్షిణ చేయనే లేదు. అట్టివానికి నీ వేల బుద్ధి, సిద్ధియను సుందరాంగుల నిచ్చి

కల్యాణము చేసితివి. అని ఆవేశముతో అడిగిఅలిగినాడు. నాయనా ! నీవు ఒక్క పర్యాయము మాత్రమే భూ ప్రదక్షిణ చేసితివి. మీ సోదరుడగు గణపతి బుద్ధిమంతుడగుట చేత నారద మహర్షి చెప్పిన మాటలు విని తల్లి దండ్రుల చుట్టూ ముమ్మారు ప్రదక్షిణ చేసినాడు. శాస్త్రానుసారము అతడు పధునాల్గు భువనముల చుట్టు ప్రదక్షిణ చేసిన ఏ ఫలమో, అంతకన్నా ద్విగుణీకృత ఫలితమును పొందినాడు. కల్యాణము జరిగినది.

కావున సోదర బాలులారా ! భారత పౌరులారా ! పై వారిని ఆదర్శముగా పెట్టుకొని, శివాజీ వలె, గాంధీ వలె, శ్రావణ కుమారుని వలె పుండరీకుని వలె మీ మీ తల్లిదండ్రుల సేవలు జేయుచు కాలము గడుపుదురేని మీకు శాంతి, సుఖము, ఆనందము గలుగుటలో ఆశ్చర్య మేమి గలదో ఆలోచింపుడు. నిస్వార్థముతో, నిష్కామముగా సేవలు చేయుట చేతనే గదా ! పైవారికి అమరత్వము లభించినది.

బాల బాలికలారా ! ఇప్పటి నుండే ఆది దంపతుల స్వరూపులగు తల్లి దండ్రులకు, భాగవతులకు, కుంటి, గ్రుడ్డి, వృద్ధులకు నిష్కామ భావనతో సేవలు చేసి తరింతురు గాక.

"శ్రీరామ జయరామ జయ జయ రామ"

# 8. తల్లిదండ్రులే పార్వతీ పరమేశ్వరులు

శ్రీరామ జయరామ జయజయరామ




ఈ అనంత సృష్టిలో గల సర్వజీవులకు మూలకారణము భగవంతుడు. ఆ జీవరాసులకు సుఖము, శాంతి, ఆనందము గావలెనన్న అతని కృప యుండిననే గలుగును. లేకుండిన దుఃఖ భూయిష్టముతో జీవింపవలసి వచ్చును. అట్టి జీవులు పుట్టుచు, గిట్టుచు నానా యోనులలో తిరుగాడ వలసినదే. సందేహములేదని పురాణాది గ్రంథములు, పెద్దలు చెప్పిరి. చెప్పుచున్నారు. చెప్పగలరు.

ఈ కలి కాలమున ప్రత్యక్ష దైవదర్శనము, సంభాషణము, సేవనము అతిదుర్లభమైన విషయము. అందులకుగాను ఆ పార్వతీ

పరమేశ్వరులే మన తల్లి దండ్రుల రూపమున జన్మించిరి. అట్టి తల్లిదండ్రుల సేవలు చేసిన భగవద్దర్శనము, సంభాషణ సులభ ముగ నగునని మన భక్త పుండరీకుని జీవితమే నిదర్శనము.

మనోవాక్కాయ కర్మల ద్వారా ప్రత్యక్ష దేవతలగు తల్లి దండ్రుల సేవలు చేయుటయే పుత్రుని కర్తవ్యము. పార్వతీ పర మేశ్వరుల బింబములే తల్లి దండ్రుల స్వరూపమని యెవరు తెలిసికొని వారికి చతుర్విధ సేవలు సల్పుదురో అట్టివారే ధన్యులు. వారికి వేరే విధమగు సాధనలతో పనిలేదు. సులభమగు సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్య, ముక్తులను పొందగలరు. ఏ పుత్రుడు తల్లిదండ్రులకు సేవలుచేయునో అట్టి వానికి మోక్షము కరతలామలకము.

తల్లి దండ్రుల సేవలు చేయ వారిని నిందించుచు, బాధిం చుచు, ఆహార విహారాదులు లభింప చేయకుందురేని అట్టి పుత్రు లకు రౌరవ నరకము దప్పదు. ఎన్ని సత్కార్మలు చేసినను తామి స్రమము, అంధతా మిస్రమము మహారౌరవము, అసిపత్రవనం, కాలసూత్రం, నరక బాధలు నుండి విడివడలేరు. అట్టివారు జీవి తాంతము దుష్కీర్తిని గడింతురు. కష్టముల నొందుదురు. వారు మరణించినను అపకీర్తిపోదు.

మాతా పితలకు సేవలు చేయు పుత్రులు, పుత్రికలు మాన వులు గారు. వారు నరరూప దేవతలే. అట్టి పరమ పుణ్యులు వేరొక విధముగ భగవానుని ఆరాధింపకయే మోక్షమును పొందు దురు. అట్టి తల్లిదండ్రుల సేవలు చేసిన పుత్రులకు భగవంతుడు

స్వయముగా దర్శన మిచ్చును. అట్లు దర్శనము పొందిన మహా భక్తులెందరో గలరు. అట్టి వారిలో పుండరీకుడు ఒకడు.

మహారాష్ట్ర దేశములో పండరీపురమను పట్టణము గలదు. అందు పుండరీకుడను బ్రాహ్మణుడు కలడు. అతనికి తల్లి దండ్రులనిన మిక్కిలి ప్రేమ. యుక్త వయస్సు వచ్చుట తోడనే తల్లిదండ్రులు పుండరీకునకు వివాహము చేసిరి. ఆమె మిక్కిలి అందగత్తె. పుండరీకుడు భార్యా లోలుడై వృద్ధులగు తల్లిదండ్రులను చూడక ఆమెతోనే కాలము గడుపు చున్నాడు. వారు ఆహార విహారాదులకు దూరమై బాధలు సహింప లేకుండిరి.

ఒక దినమున పుండరీకుడు భార్యా సమేతుడై హరికథ వినుటకు శ్రీరామ మందిరమునకు వెడలెను. కథా ప్రవచనము రసవత్తరముగా జరుగు చున్నది. వినుటకు వీనులు విందుగా నున్నది. కాశీ మహత్మ్యమును గూర్చి కథా వాచకు డిట్లు పలుకు చున్నాడు.

కాశీ వంటి పుణ్యక్షేత్రము భూలోకములో లేదు.

ఈ పరమ పావన కాశీపురంలో చనిపోయిన వారలకు శ్రీ శంకరుడు శ్రీరామ తారక మంత్రము నుపదేశించును. అందువల్ల వారికి ముక్తి సులభముగా లభించును. కాశీ పట్టణములోనే నివశించువారు అదృష్టవంతులు. వారే ధన్యులు అని పలికినాడు పుండరీకుని భార్య ఆ మాటవిన్నది. కథ పూర్తైన పిదప ఇంటికి వచ్చిరి.

నాథా! రాత్రి మీరు హరికథ వింటిరిగదా! ఆ కథలో కాశీలో నివాసము చేసిన వారలకు సద్గతులు గలుగునని పరమ

శివుడే స్వయముగా తారక మంత్రము నుపదేశించుననని, మర ణించిన పిదప ముక్తి యట్టి వారలకు గలుగునని కథకుడు చెప్పెను కదా! నేను కాశీలో స్థిరముగా నివసింపవలెనని, అచ్చటనే శరీరము నొదల వలెనని భావించు చున్నాను. మీరు నన్ను కాశీకి అవశ్యముగ తీసికొని పొందు అని పల్కినది.

పుండరీకుడు ఆమె మాటలు విని, ఓసతీ రత్నమా! కాశీ పట్టణము యిచ్చటకు చాలా దూరము. వృద్ధులగు తల్లి దండ్రుల నెట్లు తీసికొని పోగలము. మనముగూడను నడువజాలము. అని పల్కినాడు.

అందుల కామె 'ఓనాధా'! కష్టమైనను సరే నన్ను నీవు కాశీకి తీసుకొని వెడలుము. నీవేమి చెప్పినను వినను అని ఆమె పల్కినది.

పుండరీకుడు లోలోన బాధపడినను వృద్ధులగు తల్లిదండ్రుల నొదలి కాశీ వెడలుటకు నిశ్చయించుకొని వృద్ధులగు తల్లి దండ్రు లకు తన నిర్ణయము చెప్ప వారు ఇట్లు పల్కిరి.

నాయనా! పుండరీకా! కాశీ మనకు చాలా దూరములో గలదు. నాకోడలు సుకుమారి. నడువలేదు. నీవు ఎట్లు వెడల గలవు అనిపల్క అమ్మా మేము ఏవిధముగా నయినను కాశీ వెడలి తీరవలసినదే అని పల్కినాడు. భార్యను వెంట నిడుకొని కాశీక బయలుదేరెను.

ఐదు లేక ఆరు మైళ్ళు నడువగా పుండరీకుని భార్యను కాళ్ళు నొప్పులు కలిగినవి, అరికాళ్ళకు బొబ్బలు ఎక్కినవి, ఆ

కాలి బాధలకు సహింప లేక ఓ నాథా! నేను నడువలేను. ఇక్కడ నుండి ఒక్క అడుగు అయినను ముందుకు వేయజాలను, అని పల్కెను. పుండరీకుడు ఆమెను తన భుజముల పై కూర్చుండ బెట్టుకొని నడవసాగెను. అప్పుడప్పుడు వృద్ధులగు తల్లిదండ్రుల గూర్చి ఆలోచింప సాగినాడు. భుజములపై గల భార్య బరువెక్కి నప్పుడు వీపున ఎక్కించుకొని ప్రయాణము సాగించుచూ సాగించుచూ కాశీ పట్టణమునకు చేరెను.

ఇట్లు కొంత కాలము కాశీలో కాలము గడుపు చుండిరి. ఒక రోజున విశ్వనాథుని మందిరమునకు వెడలెను. అక్కడ హరి కథకుడు భగవల్లీలలను వర్ణించుచూ, ఇట్లు పలికినాడు. పుండ రీకుడు ఆ ప్రవచకుని మాటలను శ్రద్ధతో వినుచూ వున్నాడు. అట్టి సమయమున కథకుడు ఇట్లు పలుకు చున్నాడు.

*పితా ధర్మః పితా స్వర్గః పితా హి పరమం తపః।*
*పితరి ప్రీతిమాపన్నే ప్రీయంతే సర్వదేవతాః॥*
*సర్వతీర్థమయీ మాతా సర్వదేవమయః పితా*
*మాతరం పితరం తస్మాత్ సర్వయత్నేన పూజయేత్*
*మాతరం పితరం చైవ యస్తు కుర్యాత్ ప్రదక్షిణమ్*
*ప్రదక్షిణీకృతా తేన సప్తద్వీపా వసుంధరా॥*

తండ్రే ధర్మ స్వరూపుడు తండ్రే సర్వదేవత. ఏ పుత్రుడు, పుత్రిక కాని తల్లి దండ్రుల సేవ చేయునో అట్టి వారిపై ముక్కోటి దేవతలకు అనుగ్రహము కలుగును. తల్లి పదునాలుగు లోకములో గల తీర్థముల కన్నను గొప్పది. తండ్రి సర్వ దేవతా స్వరూపుడు

కనుక మనోవాక్కాయ కర్మల ద్వారా పుత్రులు పుత్రికలు తల్లి దండ్రులకు సేవాధి కర్మలు చేయ వలయును. తల్లి దండ్రులకు ఎవరు ప్రదక్షిణలు చేయుదురో అట్టివారు పదునాలుగు భువనములు ప్రదక్షిణ చేసినట్లే. (వినాయకుడు నారదుని సలహా ప్రకారము తల్లిదండ్రుల చుట్టూ ప్రదక్షిణ చేయుట చేత పార్వతీ పరమేశ్వరులు సిద్ధి, బుద్ధి అను ఇరువురు కన్యలను యిచ్చి పెండ్లి చేసెను గదా!)

జన్మను ఇచ్చిన తల్లి దండ్రులకు సేవ, పూజ అతిధి కర్మలు చేయక ఆహార విహారాదులు సల్పనేని అట్టి వాడు అధముడు. కొన్ని కల్పముల వరకు కృమి మొదలుగా గల నరక లోక నివాసి యగును. ఏ పుత్రుడు, రోగ పీడితులై వార్ధక్యముతో బాధ పడుచున్న వారై కంటి చూపు కోలుపోవుట చేత దినమొక గండముగా గడుపుచూ, దుఃఖితులగు తల్లి దండ్రుల వదులునో అట్టివాడు రౌరవ నరకమును పొందును. తల్లి దండ్రులను ఆరాధింపక తీర్ధయాత్రలు చేసినప్పటికి ఫలితము పొందలేరు. అట్టివాడు పక్షుల వలె, కీటకముల వలె అటు నిటు సంచరించుట వంటిది.

ఈ సంతోషదాయక మగు విషయము పుండరీకుని చెవిలో పడినది. అతనికి తన తల్లి దండ్రుల విషయము జ్ఞప్తికి వచ్చినది. హృదయములో బాధపడ సాగినాడు. అతడు పరిగిడి తల్లి దండ్రుల వద్దకు వచ్చి వారి చరణములపై పడి ఏడ్చుచూ, నేడ్చుచూ యిట్లు పలికినాడు.

తల్లి దండ్రులారా నా తప్పులను మన్నించుడు. మాతృ పితృ ద్రోహిని మహాపాపిని. నరక నివాసమునకు అర్హుడను.

నేను మీకు తగిన విధముగా సేవలు చేయలేని దురదృష్టవంతు డను. మీరు నన్ను అనుగ్రహించని యెడల నేను అనేక సంవత్స రముల వరకు మహారౌరవ నరకము అనుభవింపవలసి వచ్చును. కనుక క్షమింప వేడుచున్నాను.

ఆ వృద్ధులగు తల్లి దండ్రుల పాదములు పట్టుకొని రోధించు చుండ దయాసముద్రులగు తల్లిదండ్రులు ఇట్లు పలుకసాగిరి. నాయనా ! పుండరీకా ! మా ప్రారబ్ధమును మేము అనుభవించు చున్నాము ఇందు యే మాత్రము నీ దోషము లేదు. అని పలుక పుండరీకుడు వారి పాదములపై పడిలేచి తల్లిదండ్రులారా ! నేను విశ్వనాథుని యొక్క అన్నపూర్ణ, యొక్క దర్శనమునకు వెడలను. నా తండ్రే కాశీ విశ్వనాథుడు, నా తల్లే కాశీ అన్నపూర్ణ అని పలికి వారి వద్దనే వుండి వారికి సేవలు చేయుచూ కాలము గడిపెను.

కొంత కాలము తర్వాత ఆ వృద్ధ తల్లిదండ్రులను ఒక కావడిలో రెండువైపుల కూర్చుండబెట్టుకొని ఆ కావడిని భుజముపై బెట్టుకొని కలియుగ వైకుంఠదామ మగు పండరి పురమునకు ప్రయాణము సాగించినాడు. రాత్రింబవళ్ళు తల్లి దండ్రులను కావ డిలో కూర్చుండ బెట్టుకొని భుజముపై కావడి బెట్టుకొని మోయుచూ, మోయుచు పండరీ పురమునకు చేరిరి. భక్తుడగు వాడు భగవంతుని సేవించినట్లే తల్లి దండ్రులను కూడ సేవించ వలెను. అట్లు కాని వాడు భక్తుడు కాడని తెలిసికొన్న వాడై

తల్లిదండ్రుల సేవలోనే కాలము గడుపుచూ స్నానము చేయించుట, భోజనము చేయించుట, వృద్ధులగు తల్లి దండ్రులు నిద్ర పోయే వరకు పాద సేవ చేయుట విసన కఱ్ఱతో విసిరి గాలి తగులునట్లు చేయుట మొదలగు కార్యములో మునిగి వుండి వారిని విడిచి అటు నిటు వెడలుట లేదు. వారి చరణముల వద్దే పరుండెడి వాడు. అతని తల్లి దండ్రుల సేవా విషయములు తప్ప వేరొక విషయమును గూర్చి ఆలోచించుట లేదు. ఇట్లు తల్లిదండ్రుల సేవలు చేయు చుండగా, చేయు చుండగా మనస్సున గల దుర్గుణములు నశించినవి. ప్రశాంత చిత్తము గల వాడు అయినాడు.

దేహాభిమానము వున్న వ్యక్తికి మనస్సు (చిత్తము) ప్రకాశింప జాలదు. శబ్ద- స్పర్శ, రూప-రస-గంధ మొదలగుగా గల బాహ్య విషయములు వున్నంత వరకు మానవుడు సుఖమునే కోరు చుండును. అట్టి వాడు ఆత్మ స్వరూపమును మరచి శరీరమునే ఆత్మగా భావించి దానినే పరిచర్యలుచేస్తూ ఆ శరీర వాంఛలు తీర్చుకొనుచూ సంతోషముతో వుండును. అట్టి వానికి భక్తి గలుగ దనుటలో ఆశ్చర్యము లేదు. ఎవరి మనస్సులో విషయాంకురములు, (కామ, క్రోధ లోహమదములు) వుండవో అట్టి వాడే నిజమగు భక్తుడు, నిజమగు జ్ఞాని, అట్టి వాని శరీరమే పులకరించును. వాడే ఆనందోత్సాములతో తేలియాడుచూ వుండి తన్ను తానుమరచును. వాడే నిజమగు భక్తుడు, జ్ఞాని అనిపించుకొనును.

ఇట్లు పుండరీకుడు తల్లి దండ్రులకు సేవలుచేయు చుండ విషయ వాసనలకు దూరమైనాడు. అప్పుడు అతని హృదయ కమలమునందు దేదీప్య మానమగు జ్యోతి రూప దర్శన మివ్వ

సాగెను. అప్పుడు భగవంతుడు పుండరీకునకు దర్శన మివ్వ దలచి, ఒక రోజున పుండరీకుడు తల్లి దండ్రుల సేవలో వున్న సమయ మున శ్రీ మన్నారాయణమూర్తి దర్శన మిచ్చి ఇట్లు పలుకసాగెను.

ఓ పుండరీకా ఇటు చూడుము. నేను నీ ఇష్ట దేవతయగు విఠల నాథుడను. నీవు చేయుచున్న మాతాపితల సేవకు సంత సించితిని. నీకు దర్శనము యిచ్చుటకు వచ్చితిని. నీ వాకిట ముంగిట వున్నాను. నీ తల్లి దండ్రులకు సేవలు చేసి నమస్క రింపుము. నీ కోర్కెలు నెరవేర్చెదను అని భగవంతుడు భాషింపగా

భక్త పుండరీకుడు ఇట్లు పలుక సాగినాడు. ఓ పాండురంగా ! విఠలా ! నీవిచ్చట కేల వచ్చితివి. నిన్నెవరు పిలిచిరి. నీవు పిచ్చి వాడవా యేమి అని పుండరీకుడు పలుక భగవంతుడు యిట్లు పలికినాడు నాయనా పుండరీకా నీవు చేయుచున్న ని తల్లి దండ్రుల సేవలకు సంతసించి నేను నీకు దర్శన మిచ్చుటకు వచ్చితినని భగవంతుడు పలికినాడు.

ఆ పలుకులకు పుండరీకుడు ఇట్లు పలుకసాగెను. ఓ భగ వంతుడా ! దయామయుడా ! నీవు ఏ సేవచేయుచున్న నన్ను చూచి సంతోషించుచుంటివో అట్టి తల్లితండ్రుల సేవలను వొదలి నే నెట్లు రాగలను. కనుక నేను నా వృద్ధ తల్లి దండ్రులను నిద్ర పుచ్చి వచ్చువరకు యీ యిటుక రాతిపై నిల్చుండుము. అని పలుకుచూ లోపల నుండియే ఇటుక రాయిని విసిరివేసినాడు.

తల్లి దండ్రుల సేవలు నియమముగా చేయుచున్న పుండరీ కుని చూచి భంవతుడు సంతసించి ఇట్లు పలుక సాగినాడు.

ఓ పుండరీకా! ఆకాశములో నక్షత్రములు, సూర్యచంద్రులు ఎంత కాలముందురో అంతకాలము యీ పండరీపురములో యీ యిటుకపై నేను యిట్లే నడుమున చేతులు వుంచుకొని నిల్చుండెదను. పూజలందు కొనెదను. భక్తుల కోర్కెలు తీర్చుచుందును. ప్రపంచ ప్రసిద్ధమగు పుణ్యక్షేత్రమగును. ఇది నీకీర్తి యీ భూమండలముపై సూర్యచంద్ర నక్షత్రాదులు వున్నంత వరకు నీకీర్తి పతాకమువలె ఆకాశమున ఎగురును. నీవు చేసిన తల్లిదండ్రుల సేవ, భక్తిని గూర్చి కోట్లాను కోట్లమంది కీర్తించెదరు. నీ నామము యీ భువిపై విస్తృతముగా కీర్తింప కలిగినదై యుండును.

అప్పటి నుండి శ్రీ విఠలనాథ భగవానుడు ఇటుకపై నిల్చుండి భక్తులకు దర్శన మిచ్చుచూ, వారు కోరిన కోర్కెలు తీర్చుచుండుట జగమెరిగిన విషయమే గదా!

శ్రవణ కుమారుడు అంధులగు తల్లి దండ్రులకు, పుండరీకుడు వృద్ధులగు తల్లి దండ్రులకు సేవలు చేసి సృష్టి, స్థితి లయ కారుడగు భగవంతునే తన ప్రాంగణమునకు రప్పించ కలిగెను గదా!

కావున బాలులారా, పెద్దలారా, భక్తులారా పూజనీయులగు తల్లిదండ్రులకు సేవలు చేయుటకు వెనుదీయక నేటి నుండే ప్రారంభింపుడు. సిగ్గు, లజ్జ, అభిమానము వొదలండి.

నోరారా భగవన్నామమును కీర్తించండి.

శ్రీరామ జయ రామ జయ జయ రామ



# 9. మానవుని కన్న పశువే మేలు

రామ - రావణ సంగ్రామము ఘోరాతి ఘోరముగ జరిగినది. కోట్ల కొలది వీరులు సంగ్రామములో మడసిరి. విభీషణుడు, అతని పరివారము తప్ప మిగిలిన రాక్షసు లెల్లరు నామ రూప రహితులై రక్తపుటేరులలో కొట్టుకొని వెడలుచుండ కాకులు, గ్రద్దలు, కుక్కలు, నక్కలు ఆ ముక్కలు తిను చున్నవి. సీతకు కావలిగా యుంచిన స్త్రీలు మాత్రము మిగిలిరి.

లంక శ్రీ రామునకు స్వాధీనమైనది. శ్రీరామ - విభీషణుల అనుమతితో శ్రీ ఆంజనేయుడు సీతను జూచుటకు లంకలో గల అశోక వాటికకు వెడలినాడు. సీతాదేవి రాక్షస స్త్రీల మధ్య కూర్చుండి రామ నామము జపించుచున్నది.

సీతా మాత వద్ద కెడలి నమస్కరించి, శ్రీరాముడు రావణుని సంహరించినట్లు చెప్పినాడు. నీకు కావలి యుండి బాధించుచున్న ఈ రాక్షస స్త్రీలను చంపుటకు అనుమతి నిమ్మని యడుగ ఆమె యిట్లు పలుక సాగినది.

నాయనా! ఆంజనేయా ఈ రాక్షస స్త్రీలను చంపిన లేదా పంట్లూడ గొట్టినసూ, జుట్టు పీకినసూ, ముక్కులు కొరికినసు, కళ్ళు పీకినను నిరుపయోగములు. ఈ స్త్రీలు ప్రభువు ఆజ్ఞను పాలించుచున్నారు. అట్టి వారిని నీవేల జంపుదువు? కనుక, నాయనా! నా పూర్వ జన్మ పాపకృతమును నేననుభవించ వలసి నదే గదా!

నే చేసిన దుష్కర్మతే నన్ను వెంటాడు చున్నవి. కనుక వీరిని దండించ వద్దు. వీరిని క్షమించు చున్నాను. అపకారులకు సహితము ఉపకారము చేయుటయే నా విధానము. పూర్వ కాలములో జరిగిన గాథను విని పింతును ఆ గాథను నేను ఆదర్శముగ దీసికొని వీరిని క్షమించి అనుగ్రహించితిని. ]

నాయనా ఆంజనేయా వినుము.

*శ్లో॥ అయం । వ్యాఘ్ర । సమీపే । తు । పురాణో ।*
*ధర్మ సంహితః ।*
*ఋక్షేణ । గతిః । శ్లోకోఽస్తి । తం*
*నిబోధ, ప్లవంగమ ॥*

(వా॥ రా 410వ పేజి 40 శ్లో)

*శ్లో॥ న, పరః పాపమాదత్తే । పరేషాం*
*పాప కర్మాణాం ।*
*సమయో, రక్షితవ్యస్తు, సన్త చారిత్ర భూషణాః*

(44వ శ్లో॥)

అడవి మార్గమున ఒక బాటసారి వెడలు చుండెను. ఒక పెద్దపులి వాని వెంట పడెను. అతడు దానికి చిక్కకుండా పరుగెత్తుకొని వెడలి - వెడలి ఒక మఱ్ఱి చెట్టు నెక్కినాడు. ఆ చెట్టు కొమ్మ పైన అనేక సంవత్సరముల నుండి ఒక ఎలుగు బంటు నివాసముండు చున్నది. అప్పుడా పెద్ద పులి ఎలుగుబంటు యున్న కొమ్మ క్రిందకు వెడలి యిట్లు పలుక సాగెను.

ఓ ఋక్షరాజా ! ఎలుగుబంటు నీవు, నేను ఈ అడవిలో సంచ రించు జంతువులము. ఈతడు పరదేశవాసి. ఈతని శరీరము మనకు ఆహారమగును. మానవుని నమ్మరాదు. వీలు జూచుకొని చంపు స్వభావము గలవాడు. గనుక మనకు శత్రువు. నీ ప్రక్కకు చేరి నాడు. క్రిందకు నెట్టుము. నేను వీనిని చంపి తిందును. అని పెద్దపులి పలుక అందులకు ఋక్ష రాజిట్లు పలుక సాగెను.

ఓ పులి రాజా ! ఈ బాటసారి నేనుండు ప్రదేశమునకు వచ్చి నన్ను శరణు వేడినాడు. వీనిని రక్షించు భారము నాపైన గలదు. నీ కోర్కె ప్రకారము వీనిని క్రిందికి నెట్టజాలను. అట్లు నేను వానిని క్రిందికి నెట్టిన యెడల ధర్మమునకు హాని చేసిన దానిని యగుదును. ధర్మోరక్షతి రక్షితః అని గదా శాస్త్రము. ఒక వేళ నా కితడు అపకారము చేసినను చేయుగాక. కనుక నేనీ బాటసారిని క్రిందకు నెట్టనని పల్కి నొక కొమ్మ నాధారము చేసి కొని నిదుర పోసాగెను.

అప్పుడా పెద్దపులి, ఇదే తగిన సమయమని భావించి బాట సారి యున్న కొమ్మ వద్ద కెడలి వినయముగ యిట్లు పలక సాగి నది.

ఓ బాటసారీ నీ జోలికి నేనురాను. ఆ నిదురించుచున్న భల్లూకమును క్రిందకు నెట్టుము. నీ ప్రాణము గాపాడుకొనుము. అట్లు చేయుదువేని నీవు నీ యింటికి వెడలి భార్యా పుత్రులతో సుఖముగ జీవింప వచ్చునని పలుక అప్పుడా బాటసారి దాని మాటలు నమ్మి ఉపకారము చేసి ప్రాణరక్షణ గలుగజేసిన భల్లూక మును క్రిందికి నెట్టినాడు.

కాని ఆ ఎలుగుబంటి నిదురించుచున్నను అభ్యాస వశమున క్రిందకు పడలేదు. రెండవ కొమ్మను గట్టిగ పట్టుకొని పులినోటు పడక తప్పుకొన్నది.

అప్పుడు ఆ పెద్దపులి, ఆ ఎలుగుబంటితో యిట్లు పలుక సాగినది.

ఓ ఎలుగుబంటీ ! ఈ బాటసారికి అభయమిచ్చితివి. ప్రాణ దానము చేసితివి. నిదిరించుచున్న నిన్ను క్రిందకు దోసి నా కాహారము చేయదలచినాడు. ఎంతటి దుర్మార్గుడో చూడుము. అందుకనే ముందుగనే నేను నీకు చెప్పితిని గదా ! మానవుడు దుర్మార్గుడు. నమ్మకద్రోహి అట్టివాణ్ణి క్రిందకు నెట్టు మనినను నెట్టకుంటివి. చివరకు నీ ప్రాణములకే ముప్పుదెచ్చు కొంటివి గదా ! అని పెద్దపులి పలికినది.

ఈ మాటలువిన్న ఆ పాంథునకు ఎలుగుబంటి తన్ను క్రిందకు నెట్టునని లేదా చంపునని భయము చెందసాగెను. ప్రాణ ములు అట్లుడిగినట్లుడుక సాగెను. కాని అది అట్లు చేయలేదు.

పెద్దపులి అనేక పర్యాయములు యుక్తి యుక్తములతో గూడిన మాటలు చెప్పినను విసక అతనికి ధైర్యమును చెప్పుచు ప్రాణములు గాపాడెను. ఓ పులిరాజా ! ఈ మానవుడు నాకు అపకా రముచేసినను నీనోటికి ఆహారంగా మాత్రము కానీయను. నాకపకారి యైనను నేను వీనికి ఉపకారము చేతునని పలికినది. ఆ వెంటాడుతూ వచ్చిన పెద్దపులి భల్లూకమును నిందించుచు వెడలినది. ఆ

ఉభయులు ఆ పులి బారినుండి రక్షింప బడిరని సీతాదేవి ఆంజ నేయునితో పలికినది.

కావున బాల బాలికలారా! అపకారము తలపెట్టునట్టి మానవుల నమ్మవద్దు. అపకారికి ఉపకారము చేయుటయే విశేషము. శ్రీరామ శరణుని వంటి సద్గురుని ఆశ్రయించి సద్బోధలు చెప్పించుకోండి.

భరతమాతకు ముద్దుబిడ్డలన్న కీర్తి సంపాదించుకోండి

శ్రీరామ జయరామ జయ జయరామ



# 10. ప్రేమ భక్తి




బాల బాలికలారా ! చిరంజీవులారా ! భగవంతుడు మనల ననుగ్రహించి మానవ జన్మను ప్రసాదించినాడు. ఈ జన్మ బహుదుర్లభమని, పురాణాది గ్రంథములును ఆది శంకరుల వంటి మహాత్ములు చెప్పుచున్నారు గదా !

*("శతకోటి జన్మ సుకృతైర్పుణ్యైర్వి నాలభ్యతే॥)*

అని శ్రీశంకర భగవత్పాదులవారు పలికిరి గదా)

అట్టి దివ్యమగు జన్మ లభించినందులకు ఫలిత మేమిటో ఆలోచింపుడు. నారదుడు పుండరీకుడు. అంబరీషుడు, హనుమంతుడు, శ్రీశుకుడు, నామదేవ్, జ్ఞానదేవ్, మీరాబాయ్, ఘోరా కుంభార్, తులసీదాస్, సదన్‌కసాయి, రైదాసు, కబీర్‌దాస్, రామదాసు మొదలుగా గల వారేమి చేసిరి. నాటి నుండి నేటి వరకు మనము వారిని కీర్తించుటకు కారణమేమి ? ఆలోచింపుడు

మీరున్నూ, చిరంజీవు లేలగారాదు. సద్గుణముల నలవరచుకోండి. భగవంతుని భజింపండి.

పూర్వము ద్వాపర యుగములో జరిగిన నామ మహిమ గాథను చెప్పుచున్నాను వినండి. మీరున్నూ వారివలె నామమును నోరార కీర్తించండి.

ఒకనాడు ఖాండిక్యుడు, కేశిధ్వజుని సమీపించి వినయముగ నిట్లడిగినాడు. గురుదేవా ! ద్వాపరయుగములోని మానవులువలె యజ్ఞ యాగాది క్రతువులు నిర్వర్తింపలేరు. బ్రహ్మచర్య నిష్ఠలో కాలము గడుపలేరు గదా ! పూజలు, వ్రతములు చేయజాలరు గదా ! అయినను కలియుగములోని మానవులెట్లు తరింతురో తెలియజేయ ప్రార్థన.

అందులకు కేశిధ్వజ మహాముని సంతసించి ఖాండిక్యా ! మంచి ప్రశ్న నడిగితివి. సమాధానము చెప్పుచుంటిని జాగ్రత్తగ వినుము.

ద్వాపర యుగాంతములో వైకుంఠ నివాసియగు శ్రీమన్నారాయణుడు బృందావనములో శ్రీకృష్ణునిగ దేవకీ - వసుదేవులకు పుత్రుడై జన్మించును.

"శ్రీ కృష్ణ గోవింద హరే మురారే హేనాథ నారాయణ వాసుదేవ" అని గోప - గోపికలు కీర్తించుచు ఆ ప్రభువుకు సేవలు చేయుచు తన్మయతను పొందెదరు. సాలోక్య, సామీప్య సాయుజ్య ముక్తులు పొందెదరు. ఆ గోప, గోపికా భక్తులు యమ నియమ, ఆసన ప్రాణాయామాదులు చేయ కున్నను బ్రహ్మచర్య వ్రతము

రులై ప్రేమలో శ్రీకృష్ణుని కీర్తించెదరు. హనుమంతుడు రామ నామమును కీర్తించుచు, బ్రహ్మచర్య వ్రతమును పాటించుట చేతనే నూఱు యోజనముల విస్తీర్ణము గల సముద్రమును గోష్పాదము వలె దాట గలిగెను. అగస్త్య మహర్షి "రామాయస్వాహా" అని పల్కి, సప్త సముద్ర జలమును పానము జేసెను గదా! దేవతలు, రాక్షసులు అమృతము కొరకు సముద్రము మథింప విషము రాగా పరమ శివుడు శ్రీరామ రామ అని పలికి ఆ విషమును పానము జేసె గదా అట్టి కాలకూట విషమును పానము జేసినను రామ నామ ప్రభావము వలన మరణింప లేదు గదా! బ్రహ్మ చర్య వ్రత దారులై గోప-గోపికలు నిత్యము నిముష నిముషము శ్రీకృష్ణ గోవింద హరే మురారే హేనాథ నారాయణ వాసుదేవ అను మహా మంత్రమును జపించుచు పదునాలుగు భువన భాండముల సృష్టికర్త యగు కృష్ణ ప్రభుని, వారి వారి హృదయ మందిరము లలో నిల్పుకొని ఆనందసాగరమున మునుగుచు తన్మయతను చుందురు. ఒక నాడు లీలామానుష తనుధారి శ్రీకృష్ణ ప్రభు సన్నిధిలో జరిగిన వృత్తాంతమును చెప్పుచున్నాను. గోపికా భక్తి యెట్టిదో, వారి నామ నిష్ట యెట్టిదో, శ్రీకృష్ణుడు పరీక్ష యెట్లు చేసెనో నీకు తెలియగలదు.

నిరంతరము మధుర భక్తిలో తన్మయులై సంకీర్తనానంద డోలికలలో దేలియాడు చుండు గోప గోపికల భక్తిని, శ్రద్ధను తన పట్టపు రాణుల యొక్క శ్రద్ధా భక్తుల పరీక్షించు నిమిత్తము శ్రీకృష్ణ పరమాత్మ తన లీలల నిట్లు జేసినాడు.

అది యొకనాటి మధ్యాహ్నపు వేళ. కడుపునొప్పి వచ్చినట్లు బాధ పడసాగినాడు. కాకతాళీయముగ నారద మహర్షి శ్రీకృష్ణుని

దర్శనార్థము వచ్చినాడు. నారదుడీ భగవానుడు చేయుచున్న లీలను జూచి ఏదో భక్తుల పరీక్ష చేయు చున్నాడని భావించుకొని కృష్ణ ప్రభుని సమీపించి యిట్లు అడిగినాడు.

నారదుడు :- స్వామి! ఏదో తెలియని బాధపడుచున్నారే ?

శ్రీ కృష్ణః- ఏమీ లేదు నారదా! కడుపులో మిక్కిలి నొప్పిగానున్నది.

నారదుడుః- ఆ నొప్పి తగ్గుటకేమి యైనా ఉపాయము గలదా స్వామీ

శ్రీ కృష్ణః- గలదు నారదా ! నిరంతరము భర్త సేవచేయుచు భగవన్నామహాంబుధిలో మునుగుచున్నటువంటి భక్తుల పాద జల మున్న గ్రోలుదునేని తగ్గును.

నారదుడుః- అట్టి భక్తుల, పతిసేవకుల పాదతీర్థము దొరకని యెడల ఎట్లు బాధ నివారణమగును.

కృష్ణుడుః- అది వేరు విషయము. ప్రస్తుతమది సేవించిన వెంటనే నా బాధ నివారణమగును శాంతితో నుండగలను, అని శ్రీకృష్ణుడు పలుక వెంటనే నారదుడు పళ్లెమును, గ్లాసును తీసుకొని శ్రీ కృష్ణుని యొక్క అష్ట భార్యలు దగ్గరకు వెడలినాడు. నారదుని రాకకు వారెంతగానో సంతోషించిరి. శ్రీ కృష్ణుని బాధనుగూర్చి చెప్ప, వారెంత గానో విలపించిరి.

భార్యలుః- నారదా ! ఈ బాధ పరమాత్మకు తగ్గుటెట్లు ?

నారదుడుః- తగ్గునమ్మా: వానికి ఒక్కటే మార్గము గలదు.

భార్యలుః- అదేమిటి నారదా

నారదుడుః- ఏమిలేదమ్మా ! భర్తయే దైవమని నిష్కపటముగ గొల్చుచు సంకీర్తనానంద డోలికలలో దేలియాడు చుండు పతివ్రతల పాద తీర్థము సేవించిన తగ్గునని పలుక, ఆ మాటలకు వారు నొచ్చుకొని యిట్లు

పలికిరి, నారదా మేము మా పాదజలమును గడిగి, మా భర్తకు ఇవ్వలేము. మేము వారికి దాసీలము, పాదములు కడిగిన నీరు భర్త సేవించిన మేము నరకమునకు పోయెదము. మా భర్త మాకు దైవ స్వరూపము. మా పాదజలము దైవమున కిచ్చినట్లేగదా! ఇందులకు మేము యొప్పుకొనము అట్లు చేసినమాకు రౌరవ నరకము వచ్చి తీరును అని వారెల్లరు పలికిరి.

అప్పుడు నారదుడు నిరంతరము సంకీర్తనానంద డోలికలలో దేలియాడుచు పతి సేవయందే కాలము గడుపుచుండు, గోపికల వద్ద కెడలి కృష్ణుడు పడుచున్న బాధను గూర్చి చెప్పినాడు. వారు వివశులై యిట్లు పలుక సాగిరి. నారదా! వారికి తగ్గు ఉపాయము లేదా? అని పలికిరి ఉన్నది అమ్మా ఉన్నది. నిరంతరము సంకీర్తన చేయుచు భర్త సేవలు ఎవరైతే చేయుచుందురో, అట్టి స్త్రీ శిరోమణుల పాదజలము సేవించిన తగ్గునట. అని పలుక వారెల్లరు మా పాద జలము ఇచ్చెదమని పళ్లెరము, గ్లాసు తెచ్చితివా? నారదా! అని పలికిరి. అప్పుడు నారదుడు అమ్మా మీ పాదములు గడిగిన జలమును భగవంతున కిచ్చిన వారు సేవించిన యెడల మీరు నరకమున కష్టముల పాలయ్యెదరు అని పలికినాడు.

అప్పుడు గోపికలు యిట్లు పలుకసాగిరి. నారదా! మేముఏమయినను మాకిష్టమే. మా కృష్ణ ప్రభుని కడుపు బాధ పోగొట్టుటయే మా ధ్యేయము అని వారుపలుక, నారదుడు తనచేతిలోగల పళ్లెమును గ్లాసును ఇచ్చి వారి భక్తిని పరీక్షించుచుండ ఇంతలోనే గోపికలెల్లరు వచ్చి "శ్రీకృష్ణ గోవింద హరే మురారే హేనాథ నారాయణ

వాసుదేవ" అని కీర్తించుచు వారి వారి పాదములు గడిగి "శ్రీకృష్ణార్పణమస్తు" అని పలికి, నారదుని చేతిలో ఆ తీర్థ జలము నుంచిరి. నారదున కెంతయో ఆశ్చర్యముగా నున్నది. శ్రీకృష్ణ ప్రభుని లీలా వినోద క్రీడలు కొనియాడుచు ఆ జలమును తీసికొని వెడలి మయూర నటనా చాతుర్య సంపన్నుడు, గోప గోపికా సేవ్యుడు, మురళీధారి పట్టు పీతాంబర ధారియైన శ్రీకృష్ణునకు గోవిందార్పణ మని సమర్పించినాడు.

రాధాకృష్ణా :- ఆ గోపిక లెల్లరు శ్రీకృష్ణ గోవింద హరే ! మురారే ! హేనాథ నారాయణ వాసుదేవ యనుచు నామమును జేయుచు వారి వారి పాదముల ప్రక్షాళనసులు జేసిరి. ఆ తీర్థ జలముల నాకిచ్చుచుచు "శ్రీకృష్ణార్పణమస్తు" అని పలికిరి. నేను తమరికి "గోవిందార్పణముగ" సమర్పించు చున్నానని పలికినాడు. మయూర మకుట ధారియు వైజయంతిమాలను పట్టు పీతాంబర ధారియగు శ్రీకృష్ణుడు ప్రేమతో సంతోషముగా త్రాగినాడు. కడుపునొప్పి తగ్గినది. నారదా ! నామ మహిమ ఎంత గొప్పదో చూచి తివా ? అని పలికినాడని ఖాండిక్యునకు కేశిధ్వజుడు చెప్పినాడు.

జప, తప, యజ్ఞ యాగాది క్రతువుల కన్నను నామ స్మరణమే గొప్పది యని, శ్రీరామ శరణు మహోదయులు మొదలుగా గల పెద్దలు పలుకు చున్నారు. కనుక బాల బాలికలారా చాతక పక్షులు, స్వాతి చినుకులు, చక్రవాకము, సూర్య కిరణము, చకోరములు, చంద్ర కిరణములు సర్వకాలములో పానము చేయుచున్నట్లు నిరంతరము నిశ్చల మనస్కులై భగవన్నామ మును కీర్తించి తరింతురు గాక.

శ్రీరామ జయ రామ జయ జయ రామ

# 11. అన్నదానము చేయని మానవులకు సద్గతులు లేవు

బాల బాలికలారా! మనము తిను పదార్థములలో ఎంతో కొంత మన ప్రక్కవారికి పెట్టి తినినమనస్సున కెంతో ఆనందము, శాంతి కలుగును. అట్లు తినని యెడల పశువునకు మనకు బేధ మేమి గలదు. ఇతర జీవుల కొరకు మహర్షులు ప్రాణత్యాగమే జేసిరి. రంతీదేవుడు నలుబదిరోజులు ఉపవసించి ఆకలి బాధపడు చున్నను ఆశించి వచ్చిన అన్నార్తుల నాదుకొనెను గదా!

ఇది సత్యయుగమునాటి మాట. అగస్త్యమహాముని శ్రీరామ చంద్రునితో చెప్పుట జరిగినది.

పూర్వకాలములో సుదేవుడను మహారాజు విదర్భను పాలించు చుండెడివాడు. అతనికి ఇరువురు రాణులు గలరు. వారిరువురకు చెరి యొక పుత్రుడు కలిగినాడు. పెద్దరాణి కుమారుని పేరు శ్వేతుడు చిన్నరాణి కుమారుని పేరు సురథుడు.

తండ్రియగు సుదేవుడు గతించినాడు. పెద్దవాడగు శ్వేతుడు రాజ్య పరిపాలన చేయసాగినాడు. వెయ్యి సంవత్సరములు గడిచినవి.

నల్ల వెంట్రుకలు తెల్లబడ సాగినవి. ఆయువు దిన దినము క్షీణించు చున్నదని తెలిసికొని తమ్ముడగు సురథునకు రాజ్య భారము అప్పగించి జన సంచారము, పశు పక్ష్యాదులు సంచారము,

లేని అడవికి వెడలి తపస్సుచేసి బ్రహ్మలోకమున కెడలవలెనని నిశ్చయించుకున్నాడు.

సురథుడు రాజ్యపాలన చేయసాగినాడు. శ్వేతుడు అడవిలో గల ఒక సుందర సరోవరము చేరినాడు. తీవ్రముగ తపస్సుచేసినాడు. కొంత కాలమునకు మృత్యుదేవత కౌగిలింతలో చేరినాడు.

శ్వేతుడు బ్రహ్మలోక ప్రాప్తి కొరకు తపస్సుచేసినాడు. బ్రహ్మలోక నివాసము కలిగినది. కాని ఆకలి దప్పులు మాత్రము శ్వేతుని వదలుటలేదు. ఉత్తమ బ్రహ్మలోకమునకు వచ్చినను నాకు అధికముగ ఆకలి-దప్పులు పీడించుటకు కారణ మేమై యుండునో, బ్రహ్మనే అడిగి తెలిసుకొనవలెనని సూక్ష్మ శరీర రూపుడగు శ్వేతుడను కొనెను గాని శరీరము శిథిలమై యుండుట చేత తేవ లేకుండినాడు.

ఎంతో కష్టపడి సృష్టికర్తయగు బ్రహ్మనుచేరి తనకు గల్గు ఆకలి దప్పుల బాధను చెప్పినాడు వాటి నివారణోపాయము తెలుపమన్నాడు.

శ్వేతుని మాటలు బ్రహ్మ విన్నాడు. వాని పలుకల కిట్లు బ్రహ్మ సమాధాన మిచ్చెను.

నాయనా శ్వేతా! మర్త్యలోకములో నీ శరీరము చెడకుండా వున్నది. నీవు ఆ మాంసమును తినుచు ఆకలి దప్పులు పోగొట్టు కొనుము. అదే నీకు ఆహారము అని బ్రహ్మ పలుక శ్వేతుడు ఆశ్చర్యముగ స్వామీ! నేను సద్గతులు గలుగుట కొరకు తపస్సాచరించితిని. బ్రహ్మలోక నివాసినైతిని. నా నౌకరులు, ప్రజలు

సుస్వాదిష్ట పదార్థములు దినుచుండ నేనెట్లు నాశవభక్షణము చేయగలనని విన్నవించు కొన్నాడు.

అతని మాటలకు బ్రహ్మ యిట్లు పలుక సాగినాడు. నాయనా శ్వేతా ! నాకు నీపై ద్వేషము లేదు. నేనున్ను నాపై వానికి సమాధానము చెప్పవలసి యుండును. ఎవరి ఆహారము వారికి పోషణకారు డేర్పరచి యున్నాడు. బీజము లేనిదే వృక్షము లేనట్లు దాన రూపమను విత్తనమును నీవు వేయక నీ శరీరమునే పోషించుకొంటివి. నీవు దేనిని పెంచి పెద్ద చేసితివో అదే నీకు ఆహారము. గనుక నీకేమియు నిచ్చట ఆహారము లభింపదు.

నీవు భగవంతునకు స్వాదిష్ట పదార్థములను ఎన్నడూ నివేదించ లేదు. అతిథి అభ్యాగతులకు భోజన పదార్థములు పెట్ట లేదు. అనాథల నాదరించలేదు.

నీవు నీ శరీరమును వివిధ విధములగు స్వాదిష్ట పదార్థములచే పోషించితివి. కనుక దానినే భక్షించిన నీకు ఆకలి - దప్పికలు తీరునని బ్రహ్మ పలుకుచూ ఓ శ్వేతా ! సప్త సముద్రముల పానము జేసిన వింధ్యాచల మదమణచిన, వాతాపి - ఇల్వలుల జీర్ణింప జేసుకొన్న వాడును, ఋషి కులమునకు మకుటము వంటి వాడగు అగస్త్య మహర్షి నీవు మాంసము తినుచుండ ఎప్పుడు చూచునో అప్పుడు నీకి గతి దప్పును. అప్పటి వరకు నీకు నీశవమును దినుట తప్పదు. అనంతశేషుడే అగస్త్య మహర్షి చేసిన అన్నదానమును గూర్చియు, తపస్సును గూర్చియు చెప్ప జాలకుండెను గదా ! అతడు దేవతలను గూడా రక్షింప గల సమ

ర్థుడు అని బ్రహ్మదేవుడు పలుక, శ్వేతుడా విధముగనే తన శవ మాంసమును తిని బ్రతుకు చుండెను.

అనేక వేల సంవత్సరములు తినుచున్నప్పు ఆ శవము తరుగుట లేదు. చెడు వాసనలు వచ్చుట లేదు. తృప్తిగతిని ఆ సరోవరములోని నీరు త్రాగి మరల దేవతా విమానముపై బ్రహ్మ లోకమునకు చేరు చుండెడి వాడు.

ఈ దుర్గ మారణ్యము లోనికి అగస్త్య మహాముని ఎట్లు వచ్చును ? నాకీ బాధ ఎట్లు తీరునని సంకట పతి మార్గము వైపు దృష్టులు గావించి అగస్త్యుని రాక కొరకు చూచు చుండినాడు. ఇట్లు కొన్ని వేల సంవత్సరములు గతించిన గాని, అతడు రాలేదు. జీవితముపై శ్వేతునకు ఏహ్య భావము కలిగినది.

ఒక రోజున అగస్త్యుల వారా మార్గమున వెడలుచు దేవ విమానము ఎచ్చటికి వెడలు చున్నదోనని భావించి అది పోవు మార్గమున పోవుచు, అది ఆగిన సరోవరమునకు చేరినాడు. ఆ విమానము నిండుగ అప్సరసలుండి వివిధ విధములుగ కీర్తనలు నాట్యములు చేయుచుండిరి. ఒక వ్యక్తి అందుండి దిగి శవమును తినుటను జూచినాడు. ఆ [redacted]శ్యమైనది.

శ్వేతుని ఆనందమునకు హద్దులు లేకుండెను. బ్రహ్మ వాక్కులు సత్యమైనవి. ఈ ప్రాంగణమున మహర్షులకు మహర్షి యగు అగస్త్యుల వారు కూడ ఉండి ఉండవచ్చును, లేని యెడల శవము అంతర్ధానము కాదుగదా! అని నాలుగువైపుల ఆ సరోవర ప్రాంగణమును వీక్షింప సాగెను.

పుష్ప, ఫల, భరితములగు చెట్ల గుంపు మధ్యన అగస్త్య మహర్షిని చూచినాడు. అతనికి గలిగిన ఆనందము వర్ణనా తీతము. వెంటనే అచ్చటి నుండి అగస్త్య మహాముని వద్దకు వచ్చి పాద ములపై పడి నమస్కరించి నాడు. అగస్త్యుడాతనిని ఆశీర్వ దించినాడు.

అప్పటి నుండి శ్వేతునకు శవ భక్షణము తప్పినది. దేవతా హారము లభించు చున్నది.

బాలులారా! అన్నదానము చేయు కుండుటచేత శ్వేతునకు ఏగతి కలిగెనో చూడుడు.

అగస్త్యునివలె భగవన్నామము చేయండి దుర్గతి పాలగుచున్న మానవుల నుద్ధరించండి.

శ్రీరామ జయ రామ జయ జయ రామ.



# 12. రామ నామ మహిమ

*'బ్రహ్మ రామతే నామ బఢ'*

*"రామ బాంధి ఉదధి లాంఘిగ యే హనుమాన్"*

(తులసీదాసు)

శ్రీరామ నామ ప్రభావమును గూర్చి శ్రీరామ శరణు సద్గురు మహోదయులు ఇట్లు పలికిరి.

రామ నామము బ్రహ్మ కన్నను, శ్రీరాముని కన్నను గొప్పది. అనంతమైనది. చిన్న మఱ్ఱి వి త్తనములో పెద్ద చెట్టు యిమిడియున్న విధముగ భగవన్నామము సర్వవ్యాపకము చెంది యున్నది. వేదము లనెడి తీగకు పుష్పించి ఫలించి పండిన ఫలము.

ఒకానొక త్రేతాయుగమున సముద్రముపై వానరులు వారధి కట్టు చుండిరి. నల నీలురు వానరుల చేతులలో గల పర్వతములు తీసుకొని సముద్రముపై వేసి సేతు నిర్మాణము చేయు చుండిరి. సముద్రపు అలలకు ఆ పర్వతము అటు నిటు కదలక నీటిపైన తేలుటను శ్రీరాముడు చూచి ఆశ్చర్యము చెంది వారి వద్ద కేగి యిట్లు అడిగినాడు.

ఓ నల నీలులారా ఏ ఆధారము లేక ఈ నీటిపై పర్వతము లెట్లు తేలియాడు చున్నవి. సిమెంటుగాని, సున్నము గాని, మట్టి గాని లేక యివి ఒక దాని నొకటి ఏల కరచుకొను చున్నవి? విడిపోవుట లేదెందుకని ?

అందులకానల నీలురిట్లు శ్రీరామునితో పలికిరి. ఓ ప్రభూ మీ నామ ప్రభావము వలన అవి అతుకు కొనుచున్నవి. మేమొక కొండపై 'రా', వేరొక కొండపై 'మ' వ్రాసి నీటిలో వేయు చుండ అవి మునుగ కుండ ఒకదాని నొకటి నీటిపై తేలియాడు చున్నవి అని పలికిరి.

శ్రీరామచంద్రునకు ఆశ్చర్యము కలిగి నా నామములో ఇంత శక్తియున్న నాలో యింకెంత శక్తి గలదోనని ఒక చిన్న రాయిని తీసికొని నీటిలో వేసినాడు. అది నీటి మీద తేలలేదు సరిగదా బుడుంగున మునిగినది. శ్రీరాము డందులకు సిగ్గు పడినాడు.

హనుమంతుడీ వింతను జూచి నవ్వుచుండ శ్రీరాముడు జూచి హనుమంతా నన్నే మీరు భగవంతుడను చుండిరి. వానరులు వేసిన పర్వతములు నీటిపై తేలుచున్నవి. నేను చిన్నరాయి వేసిన నీటిలో మునిగినది. దీనికి కారణ మేమిటి ?

మహాప్రభూ శ్రీరామ చంద్రా ! నీ నామము నందంత శక్తి గలదు. నీకర స్పర్శ వలన జీవులకు ఉద్ధారము గలుగును. నీ చేతి నుండి విడిచిన జీవులు సంసార మనెడు సముద్రమున మునుగ వలసినదే. నీ కంటె నీనామమునకు శక్తి గలదని పల్కెను. (రామ త్వత్త్వోధికం నాము ఇతిమే నిశ్చితా మతిః)

ఒక దినమున అంజనాదేవి, కౌసల్య, అగస్త్య మహాముని తల్లి సత్సంగము జరుపు కొనుచుండిరి. ప్రసంగ వశమున కౌసల్య అంజనాదేవితో నిట్లు పలికినది. ఓ అంజనా దేవి మా రాముడు సముద్రమును దాటి రావణుని, అతని వంశములోగల దుష్టులను సంహరించి వచ్చినాడు, అని పలుక అంజనాదేవి యిట్లు పలికినది.

అమ్మా మీ రాముడు వంతెనను గట్టి దాని మీదుగ నడిచి వెళ్ళినాడు. మా ఆంజనేయుడు ఎగిరి దూకినాడు. కనుక మా వాడే మిన్న అని చెప్పుచుండ అగస్త్యుని తల్లి అందుకొని యిట్లు పలుక సాగినది.

మీరిరువురును సంభాషణలు ఆపి నా మాట వినుడు. మా అబ్బాయి అగస్త్యుడు దూకనూ లేదు, వారధిపై నడువనూ లేదు. ఏ శ్రమ లేక యే ఒక గుక్కలో సముద్రపు నీటిని దాగినాడు. మా వాడే గొప్ప అని పలికినది. ఆ మాటలు విన్న కౌసల్యాదేవికి, అంజనాదేవికి బాధ గలిగినది.

అంతలోనే శ్రీరామచంద్రుడు తల్లి వద్దకు వచ్చినాడు. శ్రీరాముని చూచి కౌసల్య నాయనా నీవు రాక్షస సంహార మొనర్చి గొప్ప వాడవైతివి అని పలికినది. ఆ మాటలు శ్రీరాముడు విని అమ్మా నేనేమి గొప్పవాడను. హనుమంతుడు సముద్రమును దూకి లంక వెడలి సీత జాడ తేకున్నచో, వానరులు వారధిని నిర్మించ కున్నచో నేను లంక లోనికి వెడలెడు వాడను గాను. యుద్ధము చేసి వచ్చెడు వాడను గాను కనుక నా కంటె హను మంతుడే గొప్పవాడు అని పలికినాడు.

వీరు నలుగురున్న ప్రదేశమునకు హనుమంతుడు వచ్చి నాడు. ఆ మాటలు విని సముద్రమును రామనామము చేయుచు దుమికితిని. అందులకు అలసి సొలసితిని. కాని అగస్త్య మహ ర్షుల వారు ఏ శ్రమ లేకయే ఒక పుడిసిడిలో త్రాగినాడు. నా కంటే అగస్త్యుడే గొప్పవాడు అని హనుమంతుడు పలికి మౌనముగా

నున్నాడు. కాకతాళీయముగ అగస్త్యుడు తన తల్లి వద్దకు వచ్చి నాడు. అప్పుడు వీరందరును గలసి అగస్త్యుని నీవు గొప్పవాడవని కీర్తించిరి.

అప్పుడు అగస్త్య మహాముని యిట్లుపలికి నాడు. నే నెట్లు గొప్ప వాడను ? నాలో సముద్ర మునింకింప జేయు శక్తి ఏమి గలదు ? అదియు రామ నామము నుండియే వచ్చినది. 'రామా యస్వాహా' అని పలికి ఆ సముద్రపు నీటిని పుడిసెడు పట్టి త్రాగి తిని. కనుక రామా నా కన్న నామమే గొప్పది అని పలుక, అచ్చట చేరిన వారెల్లరు సంతోషించిరి.

కావున బాలులారా! భక్తులారా! అజామిళుడెట్టి పాపియో వాల్మీకట్టి పాపియే, చింతామణి మొదలుగా గల వారు ఘోరాతి ఘోర పాపములు చేసినప్పటికిని, మరణసమయమున భగవ న్నామమును స్మరించి ముక్తి పొందిరి గదా ! వీరిని గూడా మనము నేటికిని స్మరించు కొనుచున్నాము గదా ! చిరంజీవు లైనారు గదా !

గణపతి రామనామమును వ్రాసి ప్రదక్షిణలు సల్పుట చేత ప్రథమ పూజ్య పదవిని పొందెను గదా ! సముద్ర మథన సమ యమున హాలాహలము వచ్చి భువన భాండముల భస్మింప జేయు చుండ దేవతల కోర్కెపై రామ నామము స్మరించి పానము చేసిన శివుడు మరణింప లేదు గదా ! హనుమంతుడు రామ నామమును స్మరించి చిరంజీవి అయ్యె గదా ! ధృవుడు, నారద పరాశర అంబ రీషాదులు భగవన్నామము స్మరించియే తరించుటయే గాక, చిరం జీవులైరి గదా ! ఈ ఘోర కలియుగములో కూడ మీరాబాయికి

తన ఆడుబిడ్డ కాలసర్ప విషమివ్వగా రామ నామము స్మరించి పానము చేసెసనియూ, మరణింప లేదనియూ ఆమె జీవిత చరిత్ర చెప్పు చున్నది గదా! కనుక బాలులారా! మీరున్నూ తదేకాగ్రత చిత్తులై నోరార రామ, కృష్ణ, గోవింద నామములు కీర్తించి, స్మరించి చిరంజీవు లయ్యెదరు గాక!

శ్రీరామ జయ రామ జయ జయ రామ



ఓం

శ్రీ హనుమతే నమః

# హనుమాన్ చాలీసా

*శ్రీగురు చరణ సరోజ రజ, నిజమన ముకుర సుధారి ॥*
*వరణౌ రఘువర విమలయశ, జో దాయక, ఫల చారి ॥*

శ్రీ గురుచరణ కమలములోని రజస్సుచే నామనస్సను అద్దమును శుభ్రము చేసికొని ధర్మార్థ కామ మోక్షములను చతుర్విధ పురుషార్థముల నొసంగు శ్రీరామచంద్రుని విమల కీర్తిని వర్ణించెరిదను.

*బుద్ధిహీన తను జానికై, సుమిరౌ పవన కుమార్ !*
*బల బుద్ధి విద్యా దేహు మోహి హరహు, కలేశ వికార్.*

ఈ శరీరము బుద్ధి హీనతచే గలిగినదని తెలిసికొని పవన కుమారుని స్మరించెదను. అతడు నాకు బలమును, బుద్ధిని, విద్యను, నొసంగుటయే గాక కామాది వికారముల వలన గలిగిన క్లేశములను హరించు గాక.

—: చౌపాఇ :—

*చౌ॥ జయ హనుమాన జ్ఞాన గుణ సాగర*
*జయ కపీశ తిహుఁలోక ఉజాగర*

*రామదూత అతులిత బలధామా*
*అంజని పుత్ర పవనసుత నామా*

*మహావీర విక్రమ బజరంగీ*
*కుమతి నివార సుమతికే సంగీ*

కంచన వరణ విరాజ సువేశా
కానన కుండల కుంచిత కేశా

హాథ వ్రజ అరు ధ్వజా విరాజై
కాంధే మూంజ జనేఊ ఛాజై

శంకర సువన కేశరీ నందన
తేజ ప్రతాప మహా జగ వందన

విద్యావాన గుణీ అతి చాతుర
రామ కాజ కరివేకో ఆతుర

ప్రభు చరిత్ర సునివే కో రసియా
రామ అఖన సీతా మన బసియా

సూక్ష్మ రూప ధరి సియహి దిఖావా
వికట రూప ధరి లంక జరావా

భీమ రూప ధరి అసుర సంహారే
రామచంద్రకే కాజ సంవారే

లాయ సజీవన అఖన జియాయే
శ్రీ రఘువీర హరషి ఉర లాయే

రఘుపతి కీన్హీ బహుత బడా ఈ
కహా భరత సమ తుమ ప్రియభా ఈ

సహస వదన తుమ్హరో యశగావై
అస కహి శ్రీపతి కంఠ లగావై

సనకాదిక బ్రహ్మాది మునీశా
నారద శారద సహిత అహీశా

యమ కుబేర దిగపాల జహాఁతే
కవి కోవిద కహి సకైఁ కహాఁతే

తుమ ఉపకార సుగ్రీవ హిఁ కీన్హా
రామ మిలాయ రాజపద దీన్హా

తుమ్హరో మంత్ర విభీషణ మానా
లంకేశ్వర భయే సబ జగ జానా

యుగ సహస్ర యోజన పర భానూ
లీల్యో తాహి మధుర ఫల జానూ

ప్రభు ముద్రికా మేలిముఖ మాహీఁ
జలధి లాంఘిగయే అచరజనాహీ

దుర్గమ కాజ జగతకే జేతే
సుగమ అనుగ్రహ తుమ్హరే-తేతే

రామదు ఆరే తుమ రఖవారే
హోతన ఆజ్ఞా బినుపైఠారే

సబ సుఖ లహైఁ తుమ్హారీ శరనా
తుమ రక్షక కాహూ కో డరనా

ఆపన తేజ సమ్హారో ఆపై
తీనోఁలోక హాంకతే కాంపై

భూత పిశాచ నికట నహి ఆవై
మహావీర జబ నామ సునావై

నాసై రోగ హరై సబ పీరా
జపత నిరంతర హనుమత వీరా

సంకటసే హనుమాన ఛుడావైఁ
        మన క్రమ వచన ధ్యాన జో లావైఁ
సబ పర రామ తపస్వీ రాజా
        తినకే కాజ సకల తుమ సాజా
ఔర మనోరథ జోకో ఇ లావై
        తాసు అమిత జీవన ఫల పావై
చారో యుగ పరతాప తుమ్హారా
        హై పరసిద్ధి జగత ఉజియారా
సాధు సంతకే తుమ రఖవారే
        అసుర నికందన రామ దులారే
అష్ట సిద్ధి నవ నిధి కే దాతా
        అస వర దీన్హ జానకీ మాతా
రామ రసాయన తుమ్హారే పాసా
        సాదర తుమ రఘుపతికే దాసా
తుమ్హారే భజన రామకో పావై
        జన్మ జన్మకే దుఖ బిసరావై
అంతకాల రఘుపతి పురజా ఈ
        జహాఁ జన్మి హరిభక్త కహా ఈ
ఔర దేవతా చిత్తన ధర ఈ
        హనుమతసే ఇ సర్వ సుఖ కర ఈ
సంకట హటై మిటై సబ పీరా
        జో సుమిరత హనుమత బల వీరా

జై జై జై హనుమాన గుసాఈ
    కృపాకరో గురుదేవకీ నాఈ
యహ శత బార పాఠకర జో ఈ
    ఛూటహి బంది మహా సుఖ హోఈ
జో యాహ పఢై హనుమాన చాలీసా
    హో ఇ సిద్ధి సాఖీ గౌరీసా
తులసీదాస సదా హరిచేరా
    కీజై నాథ హృదయ మహ డేరా ॥

"దోహా"

పవనతనయ సంకట హరణ
    మంగళ మూరతి రూప్
రామ లఖన సీతా సహిత
హృదయ బసహు సురభూప
    ఇతి హనుమాన్ చాలీసా సంపూర్ణం.

## హనుమాన్‌జీ కి హారతి

ఆరతీ కీజై హనుమాన్ లలాకీ ।
దుష్ట దలన రఘునాథ కలాకీ ॥
జాకే బలసే గిరివర కాంపై ।
రోగదోష జాకే నికట నఝాంపై ॥
అంజని పుత్ర మహాబలదాఈ ।

సంతనకే ప్రభు సదా సహాఈ
దేపీరా రఘునాథ పఠాయే ।
లంకా జారి సియ సుధిలాయే ॥
లంకా సోకోట్ సముద్రసీ ఖాఈ ॥
జాత పవనసుత ఖారన లాఈ ॥
లంకా జారీ అసుర సంహారే ।
సియా రామజీకే కాజ సవారే ॥
లక్ష్మణ మూర్ఛిత పడే సకారే ।
ఆని సజీవన లక్ష్మణ ప్రాణ ఉబారే
పైఠిపథాల తోరి జమ కారే ॥
అహి రావనకీ భుజా ఉఖారే ।
బాఁయేఁ భుజా అసురచలమారే ॥
దాహినే భుజా సంత జనతారే ।
సుర నరముని ఆరతీ ఉతారే ॥
జై జై జై హనుమాన్ ఉఛారే ॥
కంచనధార కప్పూర లౌఛాఈ ॥
ఆరతి కరత అంజనా మాఈ ॥
జో హనుమాన (జీ) కి ఆరతి గావై
బసి వైకుంఠ పరమపద పావై ॥

# బజరంగ్ బాణ్

(శ్రీ గోస్వామి తులసీదాసు)

పూజా విధానము : శ్రీ హనుమంతుల వారి ఫోటోగాని, విగ్రహము గాని కావలయును.

శ్రీచందనము, పుష్పములు, ఊదొత్తులు మొదలగు వానితోను, ఆవునేతితో దీపారాధన ముఖ్యం, లేకుండిన నువ్వులనూనెతో చేయు వచ్చును. ఆవు నేయి కలిపి చేసిన మంచిది. రోజున్నూ ఒకే కాలమున ప్రారంభము చేసిన మంచిది.

## ని వే ద న

అరటి పండ్లు, పానకం, వడపప్పు, పటికబెల్లం, ఎండు ద్రాక్ష మొదలగునవి.

## ప్రా ర్థ న

*అతులిత బలధామం హేమశైలాభ దేహం*
*దనుజవనకృశానుం, జ్ఞానినామగ్రగణ్యం*
*సకల గుణనిధానం వానరాణామధీశం*
*రఘుపతి ప్రియభక్తం వాతజాతం నమామి*
*గోష్పదీకృత వారాశిం మశకీకృత రాక్షసం*
*రామాయణ మహామాలా*
*రత్నం వందేఽ నిలాత్మజమ్*
*యత్ర యత్ర రఘునాథ కీర్తనం*
*తత్ర తత్ర కృతమస్త కాంజలిమ్*
*బాష్పవారి పరిపూర్ణ లోచనమ్*
*మారుతిం నమత రాక్షసాంతకమ్*

మనోజవం మారుత తుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం
వాతాత్మజం వానర యూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి

శ్లో॥ వామే శైలం వైరిభిదం విశుద్ధం టంకమన్యతః
ధ్యానం స్వర్ణవర్ణంచ ధ్యాయేత్ కుండలిమ్ హరిమ్॥

తాత్పర్యము :-

శత్రువుల నాశనము చేయుటకు ఎడమ చేతియందు పర్వతమును ధరించినవాడును, మేలిమి బంగారు వంటి శరీర చ్ఛాయగలవాడును, దివ్య రత్న జటితమగు కుండలములచే ప్రకాశించువాడును నగు హనుమంతుని ధ్యానింపవలెను.

నిశ్చయ ప్రేమ ప్రతీతి తే, వినయ కరై సనమాన్
తేహి కే కారజ సకల శుభ, సిద్ధ కరై హనుమాన్

జయ హనుమంత సంత హిత కారీ
సును లీజై ప్రభు వినయ హమారీ॥
జన కె కాజ బిలంబ న కీజై॥
ఆతుర దౌరి మహాసుఖ దీజై

జైసే కూది సింధు కే పారా
సురసా బదను పైఠి బిస్తారా
ఆగే జాయ్ లంకినీ రోకా
మారేహు లాత్ గఈ సురలోకా

జాయ్ బిభీషన కో సుఖ దీన్హా
సీతా నిరఖి పరమ పద లీన్హా
బాగ ఉజారి సింధు మహ బోరా
అతి ఆతుర జమ కాతర తోరా
అచ్ఛయ కుమార మారి సంహారా
లూమ్ లపేటి లంక కో జారా
లాహ సమాన లంక జరీ గఈ
జయ జయధుని సురపుర నభ భఈ
అబ బిలంబ కేహి కారన స్వామీ
కృపా కరహు ఉర అంబర జామీ
జయ జయ లఖను ప్రాన కే దాతా
ఆతుర హ్వై దుఖ కరహు నిపాతా
జయ హనుమాన జయతి బల సాగర
సుర సమూహ సమరథ భట నాగర
ఓం హను హను హను హనుమంత హఠీలై
వైరిహి మారు వజ్రకీ కీలై
ఓం హ్రీం హ్రీం హ్రీం హనుమంత కపీసా
ఓం హుం హుం హుం హను అరి ఉర సీసా
జయ అంజనీకుమార బలవంతా
సంకరసువన వీరహనుమంతా
వదన కరాల కాల కుల ఘాలక
రాము సహాయ సదా ప్రతిపాలక
భూత ప్రేత పిసాచ నిసాచర

అగని బేతాల కాల మారీ మర
ఐస్తై మారు తోహి సపథ రామ కీ
రాఘు నాథ మరజాద నామ కీ
సత్యా హోూహు హరి సపథ పాఇ కై
రామదూత ధరు మారు ధాఇ కై
జయ జయ జయ హనుమంత అగాధా
దుఖ పావత జన కేహి అపరాధా
పూజా జప తప నేమ అచారా
నహి జానత కఛు దాన తుమ్హారా
వన ఉపవన మగ గిరి గృహ మాహీ
తుమ్హారే బల హమ్ డరపత నాహీ
జనకసుతా హరి దాస కహావో
తా కీ సపథ బిలంబ న లావో
జయ జయ జయ ధుని హోూత అకాసా
సుమిరత హోూయ్ దుసహ దుఖ నాసా
చరన పకరి కర జోరి మనావో
యహి అవుసర అబ కేహి గోహరావో॥
ఉఠ ఉఠ చలు తోహి రామ దోహాఈ
పాయ్ః పరౌం కర జోరి మనాఈ
ఓం చం చం చం చ[illegible] చలంతా
ఓం హను హను హను హను హను హనుమంతా
ఓం హం హం హంక్ దేత కపి చంచల
ఓం సం సం సహమి పరానే ఖలదల

అపనే జన క తురత ఉబారా
సుమిరత హోయ్ ఆనంద హమారా
యహ బజరంగ్ బాణ్ జిహి మారై
తాహి కహాఁ ఫిరి కవన ఉబారై
పాఠ కరైఁ బజరంగ్ బాణ్ కీ
హనుమత రచ్ఛా కరైఁ ప్రానకీ
యహ బజరంగ్ బాణ్ జో జాపైఁ
తాసోఁ భూత ప్రేత సబ కాంపైఁ
ధూప దేఇ జో జపై హమేశా
తాకె తన నహిఁ రహై కలేసా
ఉర ప్రతీతి దృఢ సరనహ్వై
పాఠకరై ధరి ధ్యాన
బాధా సబ హర కరై సబ కామ్
సఫల హనుమాన్ ॥

శ్రద్ధా భక్తులతో ఈబజరంగ్ బాణ్ నెవరు పఠింతురో అట్టివారికి భూత, ప్రేత, పిశాచ బాధలు గ్గలుగవు. సంకటము తొలగును. అష్టసిద్ధులు గలుగునని శ్రీశ్రీగోస్వామి తులసీదాసుగారు చెప్పుచున్నారు. శ్రద్ధా విశ్వాసములు ముఖ్యము.



# హనుమంతుని ధ్యాన శ్లోకములు

శ్లో॥ హనుమాన్ అంజనాసూనుః
వాయుపుత్రో మహాబలః
రామేష్టః ఫల్గుణ సఖః
పింగాక్షోఽమిత విక్రమః
ఉదధిక్రమణశ్చైవ సీతా శోక వినాశకః
లక్ష్మణ ప్రాణదాతా చ దశగ్రీవస్య దర్పహా
ద్వాదశైతాని నామాని కపీంద్రస్య మహాత్మనః
స్వాపకాలే పఠేన్నిత్యం యాత్రాకాలే విశేషతః
తస్యమృత్యు భయం నాస్తి సర్వత్ర విజయీభవేత్॥

శ్లో॥ అంజనేయం మహావీరం
బ్రహ్మవిష్ణు శివాత్మకమ్ ।
బాలార్క సదృశాభాసం
రామదూతం నమామ్యహమ్॥

శ్లో॥ మనోజవం మారుత తుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం
వాతాత్మజం వానర యూథ ముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి.

# ఈ గ్రంథ ముద్రణకు ధన సహాయము ఒసంగిన దాతలు :

| | |
|---|---|
| ఒక భక్తుడు, గుంటూరు. | రు. 1001-00 |
| ఒంగోల్ టౌన్ ఫెర్టిలైజర్సు అసోసియేషన్. | 311-00 |
| *P.* శ్రీమన్నారాయణ అండ్ బ్రదర్సు | 150-00 |
| జిల్లా కోటేశ్వరరావు, *S/o* శేషయ్య, ఒంగోలు. | 116-00 |
| దేసు వెంకటేశ్వర్లు, ఎరువుల వ్యాపారం, ఒంగోలు. | 116-00 |
| *S.* సీతారామయ్య గారు, *G. D. C. C. Bank, Chilakaluripet.* | 116-00 |
| శ్రీ వెంకటేశ్వరా మెటల్ స్టోర్సు, ఒంగోలు. | 116-00 |
| మర్చంట్సు అసోసియేషన్, ఒంగోలు. | 116-00 |
| కిషోర్ బాయిల్డ్ రైస్ మిల్స్, ఒంగోలు. | 116-00 |
| *P. V.* రమణా రెడ్డి, ఒంగోలు. | 58-00 |
| డా॥ రామ్ కుమార్, గుంటూరు. | 50-00 |
| డా॥ రఘురామ్, తెనాలి. | 50-00 |
| పత్తి చల్లయ్య, ఒంగోలు. | 25-00 |
| బెహరా కృష్ణవేణమ్మ, గుంటూరు. | 25-00 |
| తాతా పద్మనాభయ్య అండ్ సన్స్, ఒంగోలు. | 21-00 |
| సీతారామయ్య మెడికల్ స్టోర్స్, ఒంగోలు | 20-00 |
| *Ch* భాస్కరరావు గారు, గుంటూరు. | 25-00 |
| తాడేపల్లి శంకరరావు గారు, తెనాలి. | 25-00 |
| *K* శివసత్యన్నారాయణ గారు, తెనాలి. | 20-00 |
| *P.* వీరాంజనేయులు గారు, లేబర్ ఆఫీసు, గుంటూరు. | 25-00 |